# చందమామ

సెప్టెంబర్ 1970

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
75 పైసలు

సంవత్సర చందా
రూ. 9/-


అతి త్వరలో!
పి.యస్.ఆర్. పిక్చర్స్ వారి
సుగుణ సుందరి కథ
నిర్మాత: పింజల సుబ్బారావు కెమెరా & దర్శకత్వం: H.S.వేణు
రచన: చిల్లర భావన్నారాయణరావు సంగీతం: కోదండపాణి కళ: కుదరవల్లి నాగేశ్వరరావు
ఆంధ్ర: శ్రీ లక్ష్మీ నారాయణ పిక్చర్సు, సీడెడ్: జయలక్ష్మి, నైజాం: దివ్యదత్తా, మైసూరు: కె.సి.యస్. మూవీస్



# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి



ప్రొద్దున్న **వివా** త్రాగుతే... రోజంతా ఉత్సాహముగా ఉంటారు! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో వివాలోని పూర్తి మీగడగల పాలు పుష్టివంతముగా చేయబడినవి.

రాత్రి **వివా** త్రాగుతే... రాత్రంతా గాఢముగా నిద్రపడుతుంది! వివా యొక్క పసందైన రుచి మరియు దానిలోని పోషకవంతమైన పదార్థములు స్నాయువులను బలపరుస్తాయి, నరములకు ఉపశమనమును కలిగిస్తాయి, కండరములకు సేదదేరుస్తాయి.

**వివా** సులభముగా జీర్ణమవుతుంది... రోగులకు మరియు రోగమునుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సుచేయబడినది.

ఆరోగ్యమునకు త్రాగండి **వివా!**
నీళ్లలో లేక పాలలో దాని రుచి అహా!








భారతదేశములో తయారుచేయువారు:
జగత్ జీత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్,
జగత్‌జీత్ నగర్, హమీర (పంజాబ్)

సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సీ.
ఎ డివిజన్ ఆఫ్ సారాభాయ్ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi JI-3A/70 Tel.



మీ ముఖ
సౌందర్యానికి









రెమి ®
టాల్కం పౌడర్

# పళ్ళలోని పగుళ్ళతో బాధపడటం దేనికి?






## బినాకా ఫ్లోరైడ్ వాడండి

ఇది మీ పళ్ళలోని పగుళ్ళు మిమ్మల్ని బాధ పెట్టకుండానూ, దంతక్షయానికి దారి తీయకుండానూ చేస్తుంది.
బినాకా ఫ్లోరైడ్ మీ పళ్ళను గట్టి పరచి, ఆరోగ్య వంతంగా ఉంచుతుంది.
దంతక్షయానికి దారి తీసే పక్షంలో, పంటి ఎనామిల్ దెబ్బ తిన నియ్యకుండా ముస్ముందుగానే కాపాడుతుంది.

బినాకా ఫ్లోరైడ్—భారత దేశంలోని ఒకే ఒక ఫ్లోరైడ్ టూత్ పేస్టు—దీనిలో
మాత్రమే సోడియమ్-మోనో-ఫ్లోరో-ఫాస్ఫేట్ (యస్.యమ్.ఎఫ్.పి) ఉంది. ఇది—

- నోటిలో హానిచేసే ద్రవపదార్థాల్ని తయారు చేయికుండా చేస్తుంది
- పంటి ఎనామిల్‌ని గట్టి పరుస్తుంది
- బాధపెట్టే పంటి పగుళ్ళను రాకుండా అరికడుతుంది


దంతక్షయాన్నీ, పంటి పగుళ్ళనీ
అరికడుతుంది మూడు రకాలుగా
—బినాకా ఫ్లోరైడ్

CIBA Cosmetics

ULKA-CF-27a TEL




## (దీపావళి సంచిక)

ఎనిమిది త్రివర్ణ చిత్రాలు, ఎన్నో కార్టూన్లు, మరి అనేక ఏకవర్ణ చిత్రాలతో ప్రత్యేక సంచిక దీపావళికి ముందే వెలువడుతుంది.

ఏజంట్ల వద్ద వెల రు. 5/–మాత్రం. రు. 6/–లు పంపితే మేము రిజిస్టర్డు పోస్టులో కాపీ పంపుతాము.

'యువ' ఏజంటు వద్ద గాని, మా వద్ద గాని మీ కాపీ ఇప్పుడే రిజర్వు చేసుకోండి.



## గమనిక

జనవరి 1971 నుంచి 'యువ' సచిత్ర మాసపత్రిక ఎక్కువ కథలతో, ఎక్కువ చిత్రాలతో, సంక్షిప్త నవలతో, అత్యంత ఆకర్షణీయంగా వెలువడుతుంది.

విడి సంచిక రు. 1-50 మాత్రమే. చందాదారులుగా చేరగోరువారు రు. 18/- పంపప్రార్థితులు. ప్రస్తుత చందాదారుల మిగిలిన డబ్బు వారిపేర జమవేసి జనవరి నుంచి కాపీలు పంపెదము.

**యువ ఆఫీసు**

1, ఆర్కాట్‌రోడ్డు, మద్రాసు–26.

# మజా మజాగా ఉండండి... గోల్డ్ స్పాట్ త్రాగండి!






mcm/pb/9b tel

గోల్డ్ స్పాట్-ఇప్పుడే మీ కోసం ప్రత్యేకంగా
తెరిచి ఇవ్వబడిందనిపించే తాజా రుచి.
గుటకలు మింగించే రుచితో, జీవం తొణికిసలాడే,
గోల్డ్-స్పాట్. హుషారుతో మీ ఒంట్లో రక్తం
పరవళ్లు త్రొక్కేటట్లు చేస్తుంది. మజా మజాగా
ఉండండి. గోల్డ్ స్పాట్ త్రాగండి.

**తాజా రుచి కోసం గోల్డ్ స్పాట్**

# అంతు లేని ఆనందాన్ని పొందండి
# చూయింగ్ గమ్ చప్పరించి చూడండి!




కమ్మని పెప్పర్‌మింట్ రుచిగం
చిక్‌లెట్స్
చూయింగ్ గమ్

**60 పైసలకు 12**




**10 పైసలకు 2**




ఆడమ్స్‌వారి శ్రేష్ఠమైన తయారీ

# ఇదే చిత్ర కళాసృష్టిలో సంభ్రమోద్వేగాలు సంభూతమగు క్షణం...




....పాఠశాలలోని బాలకునకు, చిత్రశాలలోని అధ్యాపకునకు, ఉభయులకూ కూడా.

....సర్వస్వం మనోఫలకముపై రేఖాచిత్ర రూపములో మాత్రమే ఉన్న సమయం, వర్ణములు ఇంకనూ భావనా పటముపై అవ్యక్త రూపములో మాత్రమే ఉన్న సమయం. అదే మీ భావనా సృష్టికి అనుగుణ్యమైన విభ్రమ జనకమైన వర్ణశ్రేణితో మేము సాక్షాత్కరించు సమయం.

**షాలిమార్**
ఆయిల్ అండ్ వాటర్ కలర్స్

**షాలిమార్**
ఆయిల్, వాటర్ అండ్ పోస్టర్ కలర్స్

68 సంవత్సరాల అనుభవము అండగా గలవి



**షాలిమార్ పెయింట్స్ లి.** కోర్టాల్డ్స్ (యు. కె.) గ్రూపుకు చెందిన కంపెనీలలో సభ్యులు

విక్రయ ప్రతినిధులు: ● అద్వాని ప్రైవేట్ లి., కలకత్తా-1 ● ఎమ్. జి. షహాని అండ్ కం., (ఢిల్లీ) ప్రై. లి.. క్రొత్త ఢిల్లీ-1
● శ్వాన్-షహాని కార్పొరేషన్, బొంబాయి-1

# మీకు న్యూట్రిన్ మిఠాయిలు
# నాన్నకు అందమైన
# యాష్‌ట్రే

nutrine
SWEETS
TOFFEES

## న్యూట్రిన్
### మిఠాయిలవారి నూతన సృష్టి

అవును కమ్మని, రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు మీకు అందమైన 'యాష్-ట్రే' నాన్నగారికి—రెండూ కలిపి వస్తున్నాయి. అంతకన్నా ఏం కావాలి? న్యూట్రిన్ వారు ఎప్పుడూ ఇలాగే! రోజు రోజుకీ ఒక నూతన సృష్టి!

మీకు నచ్చిన న్యూట్రిన్ మిఠాయిలతో నింపబడిన యీ టిన్ను నేడే కొనండి. అందరూ చేరి మిఠాయిలు తిన్న తరువాత ఖాళీ డబ్బాను నాన్నగారికి యివ్వండి. అందమైన 'యాష్-ట్రే'గా వాడుకోవచ్చుగదా! ఏమి గమ్మత్తు!




ఒక్కొక్క మిఠాయియందు ఫలరసపూరిత విందు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, పలమనేరు రోడు, చిత్తూరు (ఆం.ప్ర)

NCM-8.TE



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"శిథిలాలయం" రంగుల బొమ్మ సీరియల్ ఈ సంచికతో పూర్తి అవుతున్నది. వచ్చే సంచిక నుంచి మరొక రంగుల బొమ్మ సీరియల్ ప్రారంభ మవుతుంది.

"ఉపదేశార్హత" అన్న కథ చాలా చిన్నదైనా అందులో ఉన్న నీతి ఎంతో గొప్పది. తాము చెయ్యని మంచి పనులను ఇతరులకు బోధించేవారు జీవితంలో కొల్లలు. కాని తాము చెప్పే నీతులను స్వయంగా ఆచరించేవాళ్ళే ఇతరులకు నిజమైన మార్గదర్శకులు.

సంపుటి 47 సెప్టెంబర్ '70 సంచిక 3






# పిసినిగొట్టు

ఒక గ్రామంలో కుమరప్ప అనేవాడు ఉండేవాడు. అతను తన గ్రామానికి సమీపంలోనే ఉండే నగరంలో వ్యాపారం చేసేవాడు. అతనిలో డబ్బు కూడబెట్టే గుణమే ఉన్నదిగాని, ఖర్చుచేసే గుణం లేదు.

అతను పెళ్ళి చేసుకున్నాక నగరంలోనే కాపరం పెడదామా అని అనుకున్నాడుగాని, నగరంలో ఖర్చు జాస్తి అవుతుందనుకుని, తన ఊళ్ళోనే కాపరంపెట్టి, వ్యాపారం నిమిత్తం రోజూ నగరానికి వస్తూపోతూ ఉండేవాడు.

కుమరప్ప తన భార్య అయిన వెంకటలక్ష్మికి పొదుపు బోధించేవాడు; ఆకలి తీరటానికి తిండి తినాలిగాని జిహ్వచాపల్యం కొద్దీ తినరాదనేవాడు. అతని ఇష్టప్రకారమే భార్య అతిసామాన్యమైన వంటచేసేది. పండగలూ, పబ్బాలూ వచ్చినా కూడా వాళ్ళ ఇంట పిండివంటలఖా అవీ ఉండేవికావు.

అయితే కుమరప్ప భార్య ఇంత కలిగిన ఇంటిపిల్ల. ఆమె తన పుట్టింట అన్నిరకాల రుచులూ ఎరిగిన మనిషి. భర్తకు జంకి పేదగా తినటం మూలాన ఆమెకు నోరు చవిచచ్చినట్టయింది.

కొంతకాలం చూసి ఆమె, భర్త నగరానికి బయలుదేరి వెళ్ళాక, తనకు ఇష్టమైనవి చేసుకుని తినటమూ, అవి చేసిన ఆనవాలు లేకుండా చెయ్యటమూ సాగించింది. వడలూ, దోసెలూ, అప్పాలూ, బూరెలూ—ఏ రోజు దేనిమీద మనసుపోతే అదెల్లా చేసుకు తినేది. ఆమెకు డబ్బు సమస్య లేదు. ఎందుకంటే కుమరప్పకు తన భార్య మీద ప్రేమా, విశ్వాసమూ ఉండేవి; ఆమె కూడా తనలాగే డబ్బు కూడబెట్టే మనిషి అనుకునేవాడు.

ఒకనాడు కుమరప్ప నగరం నుంచి బాగా చీకటిపడి తన గ్రామానికి తిరిగివస్తూ,

టి. సీతాకుమారి

తన పొరుగున ఉన్న ఇంటివాడు పలకరించే సరికి ఆగాడు.

"ఇవాళ మా ఇంట్లో పూజ చేశాం. ప్రసాదం తిని పో. నీ భార్య చేసే వంటకా లంత బాగుండవేమో!" అన్నాడు. పొరు గింటివాడు, రెండు గారెలు తెచ్చి ఇచ్చి.

"నా భార్యకు మామూలు వంట తప్ప, పిండివంటలు చెయ్యటం రాదే!" అన్నాడు కుమరప్ప ఆశ్చర్యంగా.

"అదేమిటయ్యా? నీ భార్యకు రాని పిండివంట ఉన్నదా? రోజూ మాకు రకర కాల పిండి వంటల వాసన వస్తుంది గద. నా భార్యకు అలాటి వాసన తెప్పించటం కూడా చాతకాదు. గారెలూ, వెసరట్లూ, బజ్జీలూ నీ భార్య దగ్గిర నేర్చుకోమని నా భార్యకు చెప్పాను," అన్నాడు పొరు గింటివాడు.

"అలాగా?" అంటూ కుమరప్ప తన ఇంటికి వచ్చేశాడు.

అతనికి తన భార్యను గురించి అను మానం పట్టుకున్నది. కాని అతను తన భార్యను ఏమీ అడగలేదు. తానే స్వయంగా అనుమానం తీర్చుకోవాలని నిశ్చయించు కున్నాడు.

అందుచేత, మర్నాడు అతను నగరానికి బయలుదేరినట్టు బయలుదేరి, కొంత



దూరం వెళ్ళి తిరిగి వచ్చి, దొడ్డి దారిన లోపల ప్రవేశించి, ఒక చీకటి మూల దాక్కున్నాడు.

ఆ రోజు వెంకటలక్ష్మి పెసరపప్పు వేయించి పాయసం చేసింది. కొంచెం బియ్యం నానబోసి రుబ్బి, బెల్లమూ, కొబ్బరీ, యాలకులూ చేర్చి అప్పం చేసింది. వీధిన చెరుకు గడలు అమ్ముతుంటే ఒక గడ కొన్నది. అప్పాలు తిని, పాయసం తాగి, చెరుకుగడ తరిగి ముక్కలు చేసి, అన్నీ తినేసింది. తరవాత పిప్పి అంతా జాగ్రత్తగా పోగుచేసి, దూరంగా పారేసివచ్చి, గిన్నెలూ, రోలూ శుభ్రంగా కడిగి తాను పిండివంటలు తిన్న ఆనవాలు ఏ మాత్రమూ లేకుండా చేసింది.

ఆమె ఈ పనులలో నిమగ్నురాలై ఉండగా కుమరప్ప బయటికి జారుకుని, తన కాలికి ఒక గుడ్డ కట్టుకుని, కుంటు కుంటూ ఇల్లు చేరాడు.

భర్తను చూడగానే వెంకటలక్ష్మి ఆదుర్దాగా, "కాలికి ఏమయిందండీ?" అని అడిగింది.

"ఏం కావాలి? పాము కరిచింది," అన్నాడు కుమరప్ప.

"పాము కరిచిందా? పెద్ద పామే?" అన్నది భార్య.

"పెద్దదే! నువు తిన్న చెరుకుగడంత పెద్దది! నువు తిన్న అప్పంలాగా కాలు పొంగింది! నువు తాగిన పాయసం లాగా నా నోట నురుగులు వచ్చాయి!" అన్నాడు కుమరప్ప.

వెంకటలక్ష్మి తన రహస్యం బయట పడిందని చాలా భయపడింది. కాని కుమరప్ప నవ్వుతూ, "భయపడకు. పొరపాటు నాదే! కడుపు కింత తినకుండా నోరు కట్టుకుని ఏం లాభం? ఇకనుంచీ నాకూ్కడా రోజూ పిండివంటలు చెయ్యి. హాయిగా తింటాను," అన్నాడు.






# పశువేనయం

ఒక పల్లెలో సుబ్బయ్యా అనే వాడికి ఒక నల్ల ఆవు ఉండేది. దాని కొక దూడ ఉంటె, దాన్ని పాలు తాగనివ్వక చావనిచ్చాడు సుబ్బయ్యా. అతను ఆవుకు కూడా మేత వేసేవాడు కాడు, ఊరి మీద వదిలేవాడు. అది తన పొట్ట తానే పోసుకుని, సాయంకాల మయాక ఇంటికి తిరిగి వస్తూ ఉండేది.

ఒక రోజు సుబ్బయ్యా ఆవు ఇంటికి తిరిగి రాలేదు. తప్పిపోయిన పశువులను వెతికించే బాధ్యత గ్రామాధికారిది. అందుచేత సుబ్బయ్యా గ్రామాధికారి వద్దకు వెళ్ళి, తన నల్లావు తిరిగి రాలేదనీ, తప్పిపోయిందనీ తెలియజేశాడు.

గ్రామాధికారి తన మనుషులను ఆవును వెతకటానికి పంపాడు. వాళ్ళు వెళ్ళి ఒక నల్లావును తెచ్చారు.

"ఇదేనా నీ ఆవు?" అని గ్రామాధికారి సుబ్బయ్యాను అడిగాడు.

సుబ్బయ్యా పోగొట్టుకున్న ఆవు బక్క చిక్కినది. ఈ ఆవు పుష్టిగా ఉన్నది. సుబ్బయ్యా దురాశతో, "ఇదే నా ఆవు!" అని గ్రామాధికారి అనుమతితో దాన్ని తన ఇంటికి తోలుకుపోయాడు.

కాని తీరా చూస్తే అది పాడిఆవు కాదు, వట్టిపోయినది. ఇది తన ఆవు కాదని గ్రామాధికారికి చెప్పటానికి లేదు. అందుచేత సుబ్బయ్యా ఆ ఆవును తన ఇంటనే కట్టేసి, తిండీ, నీరూ పెట్టకుండా దాన్ని ఎండ గట్టుతూ, తాను కూలిపనులు చేసుకుని బతకసాగాడు.

సుబ్బయ్యా తెచ్చుకున్న ఆవు కాళయ్యా అనే వాడిది. తన ఆవు ఇంటికి రాలేదని కాళయ్యా కొంత ఆలస్యంగా తెలుసుని, గ్రామాధికారి దగ్గిర ఫిర్యాదు చేశాడు.

గ్రామాధికారి కాళయ్యా పోగొట్టుకున్న నల్లావును వెతకటానికి తన మనుషులను

ఎస్. పరమేశ్వరరావు

పంపాడు. ఎక్కడో ఊరి పొలిమేరలో వారికి సుబ్బయ్య ఆవు దొరికింది.

"ఇదేనా నీ ఆవు?" అని గ్రామాధికారి కాళయ్యను అడిగాడు.

ఇది బక్కచిక్కిన ఆవు. కాని దాని పొదుగు చూస్తే అది పాడిఆవు లాగా కని పించింది. మేత బాగా పెడితే త్వరలోనే ఒళ్ళుచేస్తుంది.

"అవును. ఇదే నా ఆవు!" అన్నాడు కాళయ్య.

గ్రామాధికారి అనుమతితో కాళయ్య ఆ ఆవును తన ఇంటికి తోలుకుపోయి, దానికి పుష్టిగా తిండిపెట్టి పోషించసాగాడు. కొద్ది రోజుల్లోనే అది బాగా ఒళ్ళుచేసి, పాలు కూడా సమృద్ధిగా ఇవ్వటం మొదలు పెట్టింది.

ఈ లోపుగా సుబ్బయ్య వద్ద ఉన్న కాళయ్య ఆవు తిండి లేక చిక్కిపోయింది.

కొంత కాలం గడిచింది. ఒకనాడు సుబ్బయ్య తన పాడి ఆవు కాళయ్య ఇంట ఉన్న మాట తెలుసుకున్నాడు. అతను కాళయ్య వద్దకు వెళ్ళి, "మన ఆవులు మారుపడ్డాయి. నా పాడిఆవు నీకూ, నీ వట్టి పోయిన ఆవు నాకూ వచ్చింది. నా ఆవును నా కిచ్చి, నీ ఆవును నువు తీసుకో," అని పేచీ పెట్టాడు.



"ఈ ఆవును నాకు గ్రామాధికారి ఇప్పించాడు. నీ కేమన్నా ఆక్షేపణ లుంటే ఆయనతో చెప్పుకో," అన్నాడు కాళయ్య.

సుబ్బయ్య గ్రామాధికారి వద్దకు వెళ్ళి, పొరపాటు జరిగిందనీ, తన ఆవు కాళయ్యకూ, కాళయ్య ఆవు తనకూ మారిందనీ చెప్పుకున్నాడు.

గ్రామాధికారి ఇద్దరినీ, వారి వద్ద ఉన్న ఆవులనూ తెప్పించి, సుబ్బయ్య చెప్పేది నిజమేనా అని కాళయ్యను అడిగాడు.

"నిజమే కావచ్చు. కాని సుబ్బయ్య వద్ద వున్న ఆవు బక్కచిక్కి వున్నది. దాన్ని సుబ్బయ్య బలవపెట్టితేనే గాని నేను తీసుకోను. అతని ఆవును నేను పుష్టిగా చేశాను," అన్నాడు కాళయ్య.

ఈ మాట నిజమని గ్రామాధికారికి తెలుసు. అందుచేత ఆయన సుబ్బయ్యకు నెల రోజులు గడు విచ్చి కాళయ్య ఆవును బలవపెట్ట మన్నాడు.

చేసేది లేక సుబ్బయ్య నెలరోజుల పాటు కాళయ్య ఆవును బాగా మేపి తెచ్చాడు.

"ఇక నీ ఆవును నువు తీసుకుపో!" అన్నాడు గ్రామాధికారి సుబ్బయ్యతో.

సుబ్బయ్య తన ఆవును తీసుకుపోవటానికి ప్రయత్నించగా, అది రాలేదు. కోపం వచ్చి సుబ్బయ్య దాన్ని కర్రతో గట్టిగా కొట్టాడు. ఆవు అతని మీద ఎదురు తిరిగి, కొమ్ములతో అతని డొక్కల్లో కుమ్మింది.

"లాభంలేదు, సుబ్బయ్యా. అది నీ దగ్గిరికి రాదు. అది నీదే కావచ్చు గాని, నిన్ను యజమానిగా ఆమోదించదు. నువు తిండి పెట్టక దానికి చాలా ద్రోహం చేశావు. నెల్లాళ్ళుగా తిండి పెడుతున్నావు గనక కాళయ్య ఆవు నీ వెంట రావచ్చు. అది కూడా దూడను కన్నాక నీకు దాని పాడి దక్కుతుంది. దాన్నే తీసుకుపో!" అన్నాడు గ్రామాధికారి.






అకరుణత్వ, మకారణవిగ్రహః, పరధనే, పరయోషితి చ స్పృహా,
సుజన, బంధుజనే ష్వసహిష్ణుతా ప్రకృతిసిద్ధ మిదం హి దురాత్మనామ్. 1

[దురాత్ములకు దయలేకపోవటమూ, అకారణ కలహమూ, పరధనం మీదా, పరస్త్రీల మీదా ఆసక్తీ, సజ్జనుల పైనా, బంధువుల పైనా ద్వేషమూ సహజ గుణాలు.]

దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోపి సన్,
మణినా భూషిత స్సర్పః కి మసౌ నభయంకరః. 2

[విద్యగలవాడయినా కూడా దుర్జనుణ్ణి పరిహరించాలి. మణి ఉన్నప్పటికీ పాము భయంకరమైనదే గదా!]

లోభ శ్చే దగుణేన కిం? పిశునతా య ద్యస్తి కిం పాతకైః?
సత్యం చే త్తపసా చ కిం? శుచి మనో య ద్యస్తి తీర్థేన కిం?
సౌజన్యం యది కిం బలేన? మహిమా య ద్యస్తి కిం మండనైః?
సద్విద్యా యది కిం ధనైః? అపయశో య ద్యస్తి కిం మృత్యునా? 3

[లోభికి మరో అవగుణం దేనికి? కొండెములు చెప్పేవాడికి వేరే పాపం ఏముంది? సత్యం గలవాడికి తపస్సెందుకు? నిర్మలమైన మనస్సు గలవాడికి తీర్థయాత్రలు దేనికి? సుజనుడైనవాడికి అంగబలం దేనికి? గౌరవం గలవాడికి అలంకారా లెందుకు? గొప్ప విద్య గలవాడికి ధనం ఎందుకు? అపకీర్తి గలవాడికి వేరే చావెందుకు?]

దుర్జనులు



# శిథిలాలయం

## 33

[ఆలయాన్ని కప్పి వున్న రాళ్ళను, శిఖిముఖీ, విక్రమకేసరీ తొలగిస్తూండగా, అఘోరీల గురువైన ఘోరచిత్తుడు అక్కడికి వచ్చి, శిఖిముఖి ద్వారా జరిగినదంతా విన్నాడు. మరణావస్థలో వున్న శిథిలాలయ పూజారిని పలకరించి, అతడు తన శిష్యుల్నీ, ఇభ్యజాతి వాళ్ళనూ ఏనుగుల సాయంతో రాళ్ళను తొలగించమని ఆజ్ఞాపించాడు. తరవాత—]

ఘోరచిత్తుడి శిష్యులూ, ఇభ్యజాతి వాళ్ళూ శిథిలాలయాన్ని కప్పివేసిన బండ రాళ్ళను తొలగించే పనికి పూనుకున్నారు. వాళ్ళు మోకులను రాళ్ళకు కట్టి, రెండవ కొసను ఏనుగుల నడుములకు బిగించి, వాటిని గట్టిగా అదలించగానే, అవి ఘీంకరిస్తూ రాళ్ళను దూరంగా లాక్కుపోసాగినై.

శిఖిముఖీ, విక్రమకేసరీ ఘోరచిత్తుడి పక్కన నిలబడి ఎప్పుడు శిథిలాలయం బయటపడుతుందా అని, కుతూహలంగా చూడసాగారు.

సూర్యాస్తమయ సమయానికి రెండు మూడు గంటలు ముందుగానే రాళ్ళన్నీ తొలగించటంతో శిథిలాలయం బయటపడింది. అక్కడ వున్న దేవీవిగ్రహాన్నీ, ఆ విగ్రహం ముందు గుట్టలు గుట్టలుగా పడి వున్న బంగారు కణికెల్నీ చూసి, శిఖిముఖీ, విక్రమకేసరులు నివ్వెరపడి



పోయారు. కాని, వాళ్ళకు ఆ బంగారం మీద ఎలాంటి ఆశా లేదు.. తాత విక్రమకేసరి, తన రాజధానికి తీసుకు పోవాలనుకున్న అపురూపశిల్పాల కోసం ఆ శిథిలాలయం లోని అన్ని గదులూ వెతకసాగారు.

ఒక చీకటి గది వెనకవైపు నుంచి సన్నని కాంతి రావటం ముందుగా శిఖిముఖి చూశాడు. అతడు విక్రమకేసరికి ఆ సంగతి చెప్పి, ఆ కాంతి వస్తున్న చోటుకు వెళ్ళాడు. అక్కడ ఏడెనిమిది అడుగుల ఎత్తున, పలకలు తీర్చి చెక్కబడిన ఒక రాయి వున్నది. వెలుగు ఆ రాయికి ఒక పక్క నుంచి వస్తున్నది.



"కేసరీ! దీని వెనక ఏదో పెద్ద గది వున్నట్టున్నది. లోపలి నుంచి కాంతి బయటికి వస్తున్నదంటే—దాని పై భాగాన కప్పు వుండి వుండదు," అన్నాడు శిఖిముఖి.

"నాకూ అదే అనుమానం కలుగుతున్నది. కాని, ఈ రాయి ఒక పట్టాన కదిలేట్టు లేదే!" అన్నాడు విక్రమకేసరి రాతిని కదిలించే ప్రయత్నం చేస్తూ.

శిఖిముఖి తన అనుచరుల్ని కేక వేశాడు. అందరూ కలిసి తలుపులా నిటారుగా వున్న రాతిని ఒక పక్కన గట్టిగా పట్టుకుని, వెనక్కు గుంజారు. రాయి దభీమంటూ వెనక్కు పడిపోయింది. ఆ వెంటనే వారికి గదిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న బంగారు, లోహ విగ్రహాలు—అన్ని రకరకాల దేవీమూర్తులవి కనిపించినై.

ఆ విగ్రహాలను చూసి శిఖిముఖి, విక్రమకేసరులు పరమానందం చెందారు. తమ దేశంలో అలాంటి గొప్ప శిల్పాలను తయారు చేయగల శిల్పు లెవరూ లేరు. తాత విక్రమకేసరి ఇభ్యుజాతి వాళ్ళ ద్వారా ఆ కళాఖండాలను గురించి విన్నదాంట్లో అబద్ధం ఏమీ లేదు....

శిఖిముఖీ, విక్రమకేసరీ తాము చూసిన కళాఖండాలను గురించి ఘోరచిత్తుడితో



చెప్పేందుకు ఆలయం నుంచి బయటికి వచ్చారు. వాళ్ళకు ఆలయం ఎదురుగా వున్న ఒక రాతి మీద ఘోరచిత్తుడూ, పక్కనే తన బంట్లయిన అడవి దొంగల భుజాల మీద చేతులు వేసి నిలబడి, గర్భ గుడిలోని దేవీవిగ్రహం కేసి చూస్తున్న పూజారీ కనిపించారు. సవరభేరుండం అటూ యిటూ దూకుతూ పూజారికి ఏమో చెపుతున్నాడు.

శిఖిముఖి తనను సమీపించగానే, శిథిలాలయ పూజారి అతడికి నమస్కరిస్తూ, "శిఖీ, ఆటవికుడివైనా, చిన్నవాడివైనా నీకు నమస్కరించకుండా వుండలేను. నీ ధైర్యసాహసాలూ, చివరికి ఘోరచిత్తుడి సహాయం వల్లనే నేను శిథిలేశ్వరిని చూడగలిగాను. ఇక్కడ దొరికే వెండి బంగారాలతో నేను మహారాజులా జీవించాలని తలచాను. కాని, శిథిలేశ్వరి మరోలా తలచింది. నేను వెయ్యేళ్ళుగా యీ ఆలయానికి పూజారినంటే—యీ ఒక్క జన్మలోనే అని కాదు; నా పూర్వజన్మలన్నీ కలిపి అన్న మాట! నాకు పూర్వజన్మ జ్ఞానం వున్నది," అంటూ శివమెత్తిన వాడిలా అటూ యిటూ తూలిపోతూ, కళ్ళు మూసుకుని ఏదో గొణగసాగాడు.



శిఖిముఖి, పూజారిని పట్టుకున్న అడవి దొంగలను హెచ్చరిస్తూ, "జాగ్రత్త, గట్టిగా పట్టుకోండి. కాలు జారి ఘుందుకు పడ్డా టంటే, చావు తప్పదు!" అన్నాడు.

పూజారి ఆ మాటలు వింటూనే కళ్ళు తెరిచి, "శిఖీ, నే నెలాగూ ఎక్కువ కాలం బతకను. ఒకవేళ బతికినా నజ్జయిపోయిన కాళ్ళు నరికించుకుని కుంటి పూజారిగా హీనమైన బతుకు బతకాలి. సరే, నువ్వూ, విక్రమకేసరీ; నా శిష్యులైన సవరభేరుండాన్నీ, యీ ఇద్దరు అరణ్యజీవుల్నీ శిక్షించక, క్షమించి వదిలి పెట్ట కోరుతున్నాను," అన్నాడు.








ఈ క్షణాన యీ లోకంలో నా కన్న ఎక్కువ తృప్తీ, ఆనందం అనుభవిస్తున్న వాడెవడు? ఈ కళ్ళతో శిథిలేశ్వరిని చూశాను! అదుగో, దేవి పిలుస్తున్నది....పిలుస్తున్నది!'' అంటూ పెద్దగా అరిచి, దొంగల పట్టు వదిలించుకుని రాతి మీంచి కిందికి దూకేశాడు.

శిఖిముఖీ, ఘోరచిత్తుడూ, వాళ్ల అనుచరులూ తలలు వంచి పూజారి పడిన చోటుకేసి చూశారు. పూజారి నెత్తురుతో తడిసిపోయిన రాళ్ళ మీద ఒకటి రెండు క్షణాలు గిలగిలా తన్నుకుని కదలా మెదలక వుండిపోయాడు.

''దుర్మార్గుడూ, మహాపాపీ అయినవాడు చావవలసిన చావే చచ్చాడు!'' అన్నాడు కుంటి జాంగ్‌లో ఉత్సాహంగా.

''అట్లనకు. పుణ్యాత్ముడూ, మహాభక్తుడూ అయినవాడు చావవలసిన చావు చచ్చాడు, పూజారి! మహాదేవి సమక్షంలో యిలాంటి చావు ఎందరికి లభ్యమవుతుంది!'' అన్నాడు ఘోరచిత్తుడు విచారంగా.

''దొర దారిన దొర పోయాడు! నాకు గండభేరుండంలా ఆకాశంలో ఎగిరే శక్తి కూడా పోయింది!'' అంటూ సవరభేరుండం కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూశాడు. విక్రమకేసరి అలాగే చేద్దాం, అన్న సూచనగా తలాడించాడు. అప్పుడు శిఖిముఖి పూజారితో, ''వాళ్ళ విషయమై నీ కేలాటి చింతా వద్దు. వాళ్ళు సొంత బుద్ధి అంటూ లేనివాళ్ళు; కాస్త సమర్థుడైన వాడెవడికైనా వాళ్ళు విశ్వాసంగా సేవ చేస్తారు. ఈ క్షణం నుంచీ వాళ్ళు, నా అనుచర వర్గంలోని వాళ్ళు. తృప్తి కలిగిందా?'' అని అడిగాడు.

పూజారి బాధతో చిన్నగా మూలిగి, బలవంతంగా పెదాల మీదికి చిరునవ్వు తెచ్చుకుని ''తృప్తి కలిగిందా అంటున్నావా?





శిఖిముఖి అతణ్ణి కసురుతూ, "ఏయ్, భేరుండం! నీ కేనాడూ ఆకాశంలో పక్షిలా ఎగిరే శక్తి లేదు. తాగిన మైకంలో అలా అనుకుంటూండేవాడివి. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని, మంచి మార్గాన పడక పోయావో, నిన్ను సవరనాయకుడు గండు పోతుకు ఒప్ప చెప్పుతాను," అన్నాడు.

"అలాగే చేయి దొరా! వింధ్యకు దక్షిణా న్నుంచి, హిమాలయాలు చేరిన సవరజాతి వాడెవడున్నాడు? గండుపోతు తప్పక నాకు మంచి మర్యాదలు చేస్తాడు. అతని కూతురు నాగుమల్లి నుంచి మాత్రం నన్ను రక్షించండి!" అన్నాడు సవరభేరుండం.

అతడి మాటలకు అందరూ విరగబడి నవ్వారు.

సూర్యోదయంతోనే అందరూ ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. శిథిలాలయం లోని అపూర్వ శిల్పాలను, అక్కడి నుంచి తమ దేశానికి తరలించుకు పోయేందుకు శిఖిముఖి, విక్రమకేసరీ వృశ్చికనాయకుడి అనుమతి కోరారు. వృశ్చిక నాయకుడు తన జాతివాళ్ళతో సంప్రతించి, "ఆ శిల్పాలే కాదు, వృశ్చికమాత మందిరంలో వున్న బంగారు కణికెల్ని కూడా మీరే ఎత్తుకు పొండి. ఈ వృశ్చికలంకలో వాటి అవసరం



మాకు లేదు. మాకు వృశ్చికమాత వున్నది, అరణ్యంలో కావలసినంత వేటా, పండ్లూ ఫలాలూ వున్నవి!" అన్నాడు.

శిఖిముఖి వృశ్చికనాయకుడికి తన కృతజ్ఞత చెప్పుకుని విక్రమకేసరితో, "కేసరీ! నేను ఆటవికుడిగా మాట్లాడుతున్నాను; బంగార మనేది మనిషిని బాధలా, కష్టాలా పాలు చేస్తుంది. ఇది వేటాడి జీవించే మా శబరజాతి వాళ్ళ నమ్మకం!" అన్నాడు.

ఆ మాటలకు విక్రమకేసరి నవ్వి, "నీ నిజాయితీ మెచ్చదగిందే. కాని, క్షత్రియుడిగా, శూరసేనదేశ రాజకుమారుడుగా నే మాట్లాడుతున్నాను. సమర్థుడూ, వివేకీ




అయిన రాజు చేతిలో ఆ బంగారం ప్రజలకు మేలు చేస్తుంది, శత్రువుల్ని సంహరిస్తుంది!'' అన్నాడు.

''అలా అయితే, నా అభ్యంతరం ఏమీ లేదు. ఆ అపూర్వ శిల్పాలతో పాటు, బంగారాన్ని కూడా నీ రాజధానీ నగరానికి ఎత్తుకుపో,'' అన్నాడు శిఖిముఖి.

''ఆ ఎత్తుకుపోయేది నేనొక్కణ్ణే కాదు. నువ్వూ ముందుగా మా రాజధానీ నగరం వస్తున్నావు. ఆ తర్వాత మనిద్దరం కలిసి మీ కుంభారమిట్ట పల్లెకు వెళతాం. శిధిలాలయపూజారి శిఖ కోశావుగదా! జాగ్రత్తగా దాచావా? సవరనాయకుడు గండు



పోతు కూతురు నాగుమల్లి అది కావాలన్నది గదా?'' అన్నాడు విక్రమకేసరి.

''అవును, నేను ఇల్లు వదిలి యింత దూరం ఉత్తరంగా ప్రయాణించింది, ఆ శిఖ కోసమే అన్నట్టుగా యిప్పుడు అనిపిస్తున్నది. ఆ నాగుమల్లిది ఎలాంటి పగ!'' అన్నాడు శిఖిముఖి నవ్వుతూ.

''అది నాగుమల్లి కాదు, నాగుపాము! అలాంటి వాళ్ళల్లో పగా, ప్రేమాకూడా అంత బలంగానే వుంటవి. అవునా?'' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి చిరునవ్వు నవ్వుతూ పూరుకున్నాడు. ఆ తరవాత వాళ్ళిద్దరూ తమ అనుచరుల సాయంతో, శిథిలాలయంలోని బంగారాన్నీ, శిల్పాలనూ పడవలకు ఎక్కించారు. మిట్టమధ్యాహ్నం వేళ పడవలు రెండూ గోల్‌భరా కేసి తిరుగు ప్రయాణం అయినై. వీడ్కోలు ఇచ్చేందుకు వచ్చిన వృశ్చికనాయకుడికి శిఖిముఖీ, విక్రమకేసరీ తమ కృతజ్ఞత చెప్పుకున్నారు. ఘోరచిత్తుడు అతడికి, సంవత్సరానికి ఓసారి వచ్చి, దేవీదర్శనం చేస్తానని మాటయిచ్చాడు.

దారిలో ఎలాంటి ప్రమాదాలూ జరక్కుండా వారంరోజుల తరవాత పడవలు రెండూ గోల్‌భరా గ్రామం చేరినై. అక్కడ

ఇభ్యుజాతి కులపెద్ద, అందరినీ ఆహ్వానించి, రెండురోజులపాటు గొప్పగా విందువినోదాలు ఏర్పాటు చేశాడు. విక్రమకేసరి శిథిలాలయం నుంచి తెచ్చిన శిల్పాలలో సాటిలేని దనుకున్న ఒక దేవతా విగ్రహాన్ని తన తాత విక్రమకేసరి సమాధికి ఎదురుగా స్థాపన చేశాడు. నాంగ్‌సోమ్‌కూ, తదితరులకూ తను తెచ్చిన బంగారంలో కొంత పంచిపెట్టాడు.

మూడవ నాటి ఉదయం గోల్‌భరా ఇభ్యులకు వీడ్కోలు చెప్పి, శిఖిముఖీ వాళ్ళు ప్రయాణమై రెండువారాల తరవాత కామాఖ్యా నగరం చేరి, అక్కడ తాము పూర్వం విడిది చేసిన సత్రంలోనే దిగారు. సత్రపు యజమాని వాళ్ళను గుర్తించి ఎంతో మర్యాద చేసి, కుంటి జాంగ్‌లా ద్వారా శిథిలాలయాన్ని గురించి సర్వం విన్నాడు.

కామాఖ్య నగరంలో ఒక వారం రోజులు విశ్రాంతి తీసుకున్న తరవాత ఘోరచిత్తుడు తన శిష్యులతో హిమాలయాల్లోని తీర్థాలకు మళ్ళీ ప్రయాణమైపోతూ, విక్రమకేసరిని కౌగలించుకుని, "గురువు విక్రమకేసరి, మా అఘోరీలకు చేసిన మేలుకు, ఆయన మనవడివైన నీకు, మా చేతనైన సహాయం చేశాం. ఎంతో తృప్తిగా వుంది! నీకు




నూరేళ్ళ ఆయుస్సూ, ఆ తరవాత శివ సాయుజ్యం ప్రాప్తించాలని కోరుకుంటున్నాను," అన్నాడు.

కామాఖ్యనగరం నుంచి ప్రయాణమయేప్పుడు శిఖిముఖి కుంటి జాంగ్‌లాను తన వెంట రమ్మన్నాడు. బతికివున్నంత వరకూ సుఖంగా జరిగేలా చూస్తానన్నాడు. కాని అతడు ఆ నగరం వదిలేందుకు యిష్టపడ లేదు. అప్పుడు విక్రమకేసరి అతడికి కొంత బంగారం యిచ్చి, దానితో బతికినన్నాళ్ళూ సుఖంగా బతకమన్నాడు.

ఆ బంగారం చూసి కుంటి జాంగ్‌లా కృతజ్ఞతతో కళ్ళనీళ్ళ పర్యంతమై "దొరా!

నేను మొదట్లో మీకు ద్రోహం చేశాను. అయినా మీ రిద్దరూ నన్ను క్షమించారు. నేను యిక్కడే మరేదైనా సత్రం కట్టి సుఖంగా జీవిస్తాను. బహుశా, మీ కుమారులెవరైనా, యీ ప్రాంతాలు చూసేందుకు వస్తే, వారికి నా సత్రంలోనే ఆతిథ్యం జరుగుతుంది," అన్నాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ అతడి మాటలకు చాలా సంతోషించారు. తరవాత తాము తెచ్చిన శిల్పాలనూ, బంగారాన్నీ మోసేందుకు గుర్రాలనూ, వాటిని తోలేందుకు మనుషులనూ కుదుర్చుకుని, తమ అనుచరులైన అజిత వీరభద్రులతో కలిసి దాదాపు మూడునెలల ప్రయాణం తర్వాత శూరసేనదేశ రాజధానీనగరం చేరారు.

విక్రమకేసరి తండ్రి జయపాలుడు వాళ్ళకు రాజోచితమైన సన్మానం చేశాడు. భటుల ద్వారా సవరనాయకుడు గండుపోతు కుటుంబానికీ, శిఖిముఖి తండ్రి శివాలుడికీ కబురు చేసి, వాళ్ళను తన రాజధానీ నగరానికి పిలిపించాడు.

గండుపోతు కూతురు నాగుమల్లి, శిఖిముఖిని చూస్తూనే, "శిథిలాలయ పూజారి శిఖ తెచ్చావా?" అని అడిగింది.

ఎంతోకాలంగా భద్రంగా తన నడుముకు బిగించుకున్న ఆ శిఖను శిఖిముఖి ఆమెకిచ్చాడు. నాగుమల్లి ఆనందం అంతాయింతా కాదు. విక్రమకేసరి చెప్పగా వాళ్ళిద్దరి ప్రేమను గురించి విన్న రాజు జయపాలుడు, వాళ్ళ తల్లిదండ్రులతో మాట్లాడి, ఒక శుభ ముహూర్తాన, శిఖిముఖికీ, నాగుమల్లికీ వైభవంగా వివాహం చేశాడు.

శబర, సవరజాతి పెద్దలూ, వాళ్ళ పిల్లలూ, అనుచరులూ, ఒక నెలరోజుల పాటు జయపాలుడి ఆతిథ్యంలో విందులూ, వేడుకలతో కాలం గడిపి, తరవాత ఎవరి గ్రామాలకు వాళ్ళు వెళ్ళిపోయారు.

—(అయిపోయింది)





# ఆర్తరక్షణ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ శ్రమ వృథా అయిపోతున్నదని విచారించకు. సమయం అనుకూలిస్తే ఎలాటి ఆపద అయినా ఇట్టే తొలగిపోయి, శుభం చేకూరుతుంది. అందుకు నిదర్శనంగా నీకు లీలావతి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఆరావళీపర్వత ప్రాంతంలో మహీ అని ఒక చిన్న రాజ్యం ఉండేది. పర్వతశ్రేణికి అవతల ఉన్న అనేక రాజ్యాలను భల్లాటుడనే యవనరాజు జయించి, మహా క్రూరంగా పరిపాలించసాగాడు.

భల్లాటుడు మహా బలశాలి. అతని సైనికులు రాక్షసులను మరిపించగలవాళ్ళు.

## బేతాళ కథలు



అందుచేత అతని రాజ్యంలో చేరని చిన్న దేశాలవాళ్ళు కూడా, భల్లాటుడు విధించిన నియమాలకు లోబడి అతనితో సంధి చేసుకున్నారు.

మహీదేశపు రాజు కూడా భల్లాటుడితో ఒక అవమానకరమైన సంధి చేసుకున్నాడు. ఆ సంధి ప్రకారం మహీదేశం నుంచి ఏటా ఇరవై మంది కన్యలను, పదిహేనేళ్ళు నిండిన వాళ్ళను, భల్లాటుడికి కానుకగా పంపుతూ వచ్చారు. ఈ కన్యలు ఒక కనుమలో వుండే కూడలి వద్దకు నడిచి రావాలి. ఆ కూడలి కనుచూపు మేరలోకి కన్యల బంధువు లెవరూ రాకూడదు. ఈ అవమానకరమైన నిబంధనలకు తల ఒగ్గి మహీదేశపు రాజు ఏటా కన్యలను కానుక పంపుతూ వచ్చాడు.

ఇలా ఉండగా ఒక ఏడు రాజకుమార్తె అయిన లీలావతి వంతు వచ్చింది. రాజు అవమానంతో కుంగిపోయాడు. తన స్థితి ఎంత హీనమైనదో ఆయనకు తెలిసి వచ్చింది. కాని ఆయన ఏమీ చెయ్యలేడు. భల్లాటుడు మహీరాజ్యాన్ని అరగడియలో కబళించి వేయగలడు.

కన్య లందరినీ లోయలోకి తెచ్చి, కూడలికి కొంత దూరంలో వారి బంధువులు నిలిచిపోయారు. వీడ్కోళ్ళూ, ఏడవటాలూ అయిపోయాయి. కన్యా లందరూ కూడలి కేసి బయలుదేరారు. అందరికన్న నూరు బారలు ఎడంగా లీలావతి కూడా ఒంటరిగా బయలుదేరింది. వారు మలుపు తిరిగే చోట మరొక మార్గం వచ్చి వాళ్ళ మార్గంలో కలిసింది. ఆ మార్గం వెంబడి ఒక యువకుడు, ఒక గుర్రాన్ని విలాసంగా స్వారీ చేస్తూ వస్తున్నాడు.

తన వెనకగా గుర్రపు డెక్కల చప్పుడు విని లీలావతి ఆగి, వెనక్కు తిరిగి చూసింది. గుర్రం మీద ఉన్న యువకుడు ఆమెకు సమీపంగా వచ్చి, "ఎవరమ్మాయీ నువు?

చూస్తే గొప్ప వంశానికి చెందినట్టున్నావు. ఈ కొండల మధ్య ఒంటరిగా ఎక్కడికి ప్రయాణమై వెళుతున్నావు?'' అని అడిగాడు.

''మీరెవరు? ఈ రోజు ఇంత ప్రమాద స్థలంలో మీరెందుకున్నారు?'' అని లీలావతి ఎదురు ప్రశ్న వేసింది.

''నేను కాశ్మీరయువరాజును. నా పేరు జయంతుడు. ఏడాది కిందట మా నగరాన్ని విడిచి పెట్టి దేశం తిరిగాను. ఇప్పుడు తిరిగి వెళ్ళుతున్నాను. ఈ ప్రదేశం ప్రమాదకరమయిందన్నావే? ఇక్కడ నాకేమీ ప్రమాదం కనిపించదే!'' అన్నాడు జయంతుడు.

''ఈ దారినే ఇంకా కొంతదూరం వెళ్ళితే ఒక కూడలి వస్తుంది. అక్కడ ముప్పైమంది విచ్చుకత్తుల సైనికులూ, వారి సర్దారూ ఉన్నారు. వాళ్ళు యవనసైనికులు. అందులోనూ భల్లాటుడి భటులు. యములవాళ్ళన్న మాటే!'' అన్నది లీలావతి.

''అటువంటి చోటికి నువు ఒంటరిగా పోతున్నావే? ఏమిటి నీ ధైర్యం?'' అని జయంతుడడిగాడు.

''నేను ఒంటరిగా పోవటం లేదు. నా వంటి కన్యలు ఇంకా పందొమ్మిది మంది ముందు నడుస్తున్నారు,'' అన్నది లీలావతి.





జయంతుడు కొంచెం ఆలోచించి, "ఇరవైమంది కన్యలు ముప్ఫైమంది విచ్చుకత్తుల వాళ్ళను జయించగలరా? ఏమి ఆశ్చర్యం!" అన్నాడు.

"మీకు అసలు విషయం తెలియదన్న మాట. మా మహీదేశం నుంచి ఏటా ఇరవై మంది కన్యలను భల్లాటుడికి కానుకగా పంపాలి. లేకపోతే ఆ భల్లాటుడు మా దేశాన్ని ముట్టుపెట్టేస్తాడు. అతని అపారమైన సైనిక బలాన్ని ఎదిరించే శక్తి మాకు లేదు!" అన్నది లీలావతి.

జయంతుడి ముఖం ఆగ్రహంతో జేవురించింది.

"ఇంత అనాగరికమా? లోకంలో బలవంతులుంటారు. కాని బలహీనులను ఇలా అవమానిస్తారా? మీ రాజుకు పౌరుషం లేదా? ఏమైనా నేనుండగా ఇలాటి పని జరగటానికి వీలులేదు. ఆ యవనుల సంగతి నేను చూస్తాను," అంటూ అతను తన గుర్రాన్ని దౌడుతీయించాడు.

కొండదారి మరొక మలుపు తిరగగానే అతనికి మిగిలిన పందొమ్మిది మంది కన్యలూ కూడలి కేసిపోతూ కనిపించారు. వారికి ఇంకా అవతల దారి చాలా ఇరుకుగా కొండరాళ్ళ మధ్యగా ఉన్నది. ఆ ఇరుకు దారికి ఇంకా అవతల, కొంచెం ఎత్తు ప్రదేశంలో ఒక పెద్ద చెట్టు కింద యవనసైనికులున్నారు.

జయంతుడు ఆ కన్యలను ఆగమని, "మీరంతా వెనక్కు వెళ్ళండి. ఈ యేడు యవనులకు కప్పం లేదు," అన్నాడు.

కన్యలు ఆగి వెనక్కు తిరిగారు.

ఇదంతా కూడలి నుంచి చూస్తున్న యవనసర్దారు ఇద్దరు భటులను జయంతుడి పైకి పంపాడు.

జయంతుడు యుక్తిగా వారిని ఇరుకు దారిలోకి రానిచ్చి ఎదుర్కొన్నాడు. దారి ఇరుకు కావటం సైనికులకు ఇబ్బంది

అయింది. వారిద్దరూ కలిసి అతని మీద కలియబడలేక పోవటమేగాక, అతని కత్తి పోట్ల నుంచి తప్పుకోవటానికి కూడా వాళ్ళ గుర్రాలకు చోటు లేకపోయింది. కొద్దిసేపట్లో ఇద్దరూ అతని చేతిలో చచ్చారు.

అది చూసి మిగిలిన సైనికులందరూ ఒక్కసారిగా అతని పైకి వచ్చారు. అయితే అతను ఆ ఇరుకు దారి నుంచి ముందుకు కదలక, అందరినీ మరింత అవలీలగా చంపేశాడు. వారిలో ఒక్కడైనా అతనితో నిజంగా యుద్ధం చెయ్యలేదు. ఒకరికొకరు అడ్డంవసూ అందరూ అతని చేతిలో తేలిగ్గా చచ్చారు.

చచ్చి, దారికి అడ్డంగా పడి ఉన్న సైనికులను దాటుతూ జయంతుడు, చెట్టు కింద సర్దారు నిలబడి ఉన్న చోటికి గుర్రాని నడిపించాడు.

"వాళ్ళను చంపితే చంపావు. నా చేతిలో చావు. ముందు గుర్రం దిగు!" అన్నాడు సర్దారు. అతను నేల మీదనే నిలబడి, కత్తిదూసి, యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు.

జయంతుడు గుర్రం దిగి, కత్తితో సర్దారు పైన కలియబడ్డాడు. దురదృష్ట వశాన జయంతుడి కత్తి సర్దారు శిరస్త్రాణంలో గుచ్చుకున్నది. శిరస్త్రాణం కింద



పడిపోయింది. కాని జయంతుడి కత్తి విరిగి పోయింది.

"కుక్కా, ఓడానని ఒప్పుకో!" అన్నాడు సర్దారు విజయగర్వంతో.

"నీతో యుద్ధం చెయ్యటానికి కత్తి కావాలా?" అంటూ జయంతుడు చెట్టు కొమ్మ విరిచి, దానితో బలంగా సర్దారు నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో సర్దారు కింద పడి చచ్చిపోయాడు.

జయంతుడు తిరిగి తన గుర్రం ఎక్కి, కన్యలున్న చోటికి వచ్చి, "మీరంతా మీ ఇళ్ళకు తిరిగిపొండి," అని లీలావతి కేసి తిరిగి, "నిన్ను నేను కానుకగా పుచ్చు

కుంటాను. నీకు సమ్మతమేనా?" అని అడిగాడు.

"మా నగరుకు రండి. మా తండ్రి మన కిద్దరికీ పెళ్ళిచేసి, మీకు తన కృతజ్ఞత తెలుపుకుంటాడు," అన్నది లీలావతి.

"లేదు. నేను త్వరగా మా దేశం చేరుకోవాలి. మీ తండ్రి నీకు అదివరకే వీడ్కోలు చెప్పాడు. నన్ను పెళ్ళాడదలిస్తే నా వెంట వచ్చెయ్యి," అన్నాడు జయంతుడు.

లీలావతి అందుకు సమ్మతించి, అతని గుర్రం మీదనే ఎక్కి అతని దేశం వెళ్ళిపోయింది. అక్కడ వారికి వివాహం జరిగింది. వారు సుఖంగా ఉన్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. మహీదేశపు రాజుకు అంత మహోపకారం చేసిన జయంతుడు ఆయన వద్దకు వెళ్ళి, ఆయన కృతజ్ఞతలు అందుకొని, లీలావతిని ఆయన చేతి మీదుగా ఎందుకు కన్యాదానం పుచ్చుకో లేదు? లీలావతిని తీసుకుని తిన్నగా తన దేశానికే ఎందుకు వెళ్ళిపోయాడు? లీలావతిని తిరిగి చూసుకుని ఆమె తండ్రి ఎంతగానో సంతోషించేవాడుగదా! ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మహీదేశపు రాజుకు జయంతుడు చేసినది మహోపకారం కాదు, తీరని అపకారం. భల్లాటుడి భటులను చంపి కన్యలను తిప్పి పంపిన మాత్రాన మహీదేశానికి భల్లాటుడి భయం తప్ప లేదు; మరింత హెచ్చింది. జయంతుడు అంత సాహసమూ చూపినది ఒక్క లీలావతి కోసమే. అందుచేత ఆమె తండ్రి ఎదట పడకుండా, ఆమెను తీసుకుని తిన్నగా తన దేశం వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# ఉపదేశార్హత

ఒక గ్రామంలో ఒక కుమ్మరి ఉండేవాడు. వాడి కొడుకుకు ఒక దురలవాటుండేది. వాడు అన్నం ముందు కూర్చున్నప్పుడల్లా తిని, నగం పైగా కెలికి, విడిచి పెట్టేవాడు.

"మనం పేదవాళ్ళం. అలా అన్నం పారెయ్యరాదు," అని తల్లీ తండ్రీ ఎంత చెప్పినా వాడి చెవి కెక్కలేదు.

ఆ ఊళ్ళో ఒక శాస్త్రుల్లుగారున్నాడు. ఆయనను అందరూ ఎంతో గౌరవంగా చూసే వారు. కుమ్మరి ఆయన వద్దకు వెళ్ళి, వాడి తిండి గురించి చెప్పి, కాస్త బుద్ధి చెప్ప మని కోరాడు.

"నీ కొడుకును రెండు వారాల అవతల తీసుకురా," అన్నాడు శాస్త్రుల్లుగారు. కుమ్మరి ఆశ్చర్యపోయాడు. రెండు వారాలు గడిచాక అతను తన కొడుకును శాస్త్రుల్లుగారి దగ్గిరికి తెచ్చాడు.

"ఒరే, బాబూ! అన్నం బ్రహ్మస్వరూపం," అంటూ శాస్త్రుల్లుగారు కుర్రవాడికి భోధించి పంపాడు.

అది మొదలు కుమ్మరి కొడుకు అన్నం పారెయ్యకుండా తింటూ వచ్చాడు.

కుమ్మరి శాస్త్రుల్లుగారి వద్దకు వెళ్ళి, తన కృతజ్ఞత చెప్పుకుని, "సామీ, నా కొడుక్కు బుద్ధి చెప్పటానికి రెండు వారాలు గడు వెందు కడిగారు?" అన్నాడు.

"నాయనా, నీ కొడుక్కున్న దుర్గుణమే నాకూ ఉండేది. నే నది మానటానికి రెండువారాలు గడువడిగాను. నేను చేసే తప్పు నీ కొడుకును చెయ్యవద్దని ఎలా చెప్పను?" అన్నాడు శాస్త్రుల్లుగారు.

—తుంగతుర్తి రామకుమార్.





# చావురానివాడు

పూర్వం ఇటలీదేశంలో ఐప్పో పిపెట్టా అనే ఒక సాహసవంతుడైన యువక సైనికుడుండేవాడు. వాడొకనాడు నిర్జనమైన అరణ్యంకుండా పోతూండగా ఒక చోట ఒక వర్తకుణ్ణి ఇద్దరు దొంగలు పట్టి కొట్టుతూండటం కంట పడింది. వెంటనే బెప్పో పులిలాగా ఆ దొంగలపై విరుచుకు పడేసరికి, వాళ్ళు పరారీ అయిపోయారు. వర్తకుడు గాయపడలేదని రూఢి చేసుకుని, ఆయన పరిచయమైనా చేసుకోకుండా బెప్పో తన దారిన వెళ్ళిపోయాడు.

బెప్పో ప్రదర్శించిన ఈ సాహసం అతనికెంతో లాభించింది. ఎందుకంటే అలా దొంగల పాలపడిన వర్తకుడు మరెవరో కాదు మారువేషంలో తిరుగుతున్న రాజే! ఆయన బెప్పో చేసిన మేలుకు కృతజ్ఞత కలిగి ఉండటమేగాక, అతని ధైర్య సాహసాలకు ముచ్చటపడి, బెప్పోను పిలిపించి, "ఇకనుంచీ నీవు నిర్బంధ సైనికుడివి కావు. నీ కిష్టమైనప్పుడు యుద్ధం చెయ్యవచ్చు. లేకుంటే మానవచ్చు; ఎక్కడైనా తిరగవచ్చు. ఎలాగైనా జీవించవచ్చు. నిన్ను మటుకు నేను యావజ్జీవమూ పోషించి, నీ ఖర్చంతా భరిస్తాను," అన్నాడు.

బెప్పోకు ఇంతకంటె కావలిసినది లేదు. అతను ఇంతకాలమూ మోసిన సైనిక సంచీని దూరంగా గిరవాటు వేసి, నిశ్చింతగా, యథేచ్ఛగా, ఆనందంగా జీవించసాగాడు. అతనికొకనాడొక ముసలి సైనికుడు జతపడి, "నీవు సైకుడివైతే సంచీ ఏదీ?" అని అడిగాడు.

"సైనికుడుగా పని చెయ్యకుండానే మా యజమాని నన్ను పోషిస్తానన్నాడు," అన్నాడు బెప్పో.

"అదృష్టవంతుడివి. అయితే, నా సంచీ ఇస్తాను తీసుకో. అది మామూలు సంచీ

బి. అంజనేయులు

కాదు. దీని మూతి విప్పి, ఎదురుగా ఉన్న వాణ్ణి 'దూకు' అనగానే ఆ మనిషి సంచీ లోకి దూకేస్తాడు. నీవు దాని మూతి విప్పే దాకా పైకి రాలేడు. ఎన్నో ఏళ్ళుగా ఈ సంచీతో ఆడుకున్నాను. మొహం మొత్తి పోయింది. యువకుడివి కనక దీనితో కొంతకాలం నీవు కూడా ఆడుకో," అని ముసలి సైనికుడు తన వద్ద ఉన్న పెద్ద సంచీని బెప్పో కిచ్చేశాడు.

బెప్పో ఆ సంచీలో నిజంగా మహిమ ఉన్నదని రుజువు చేసుకున్నాడు. తనతో పోట్లాట పెట్టుకున్న వారిని ఒకరిద్దరిని, "దూకు," అనగానే ఆ సంచీలోకి దూకి, అతను విడిపించిన దాకా అందులోనే ఉండిపోయారు.

అతను రెండేళ్ళు తన గ్రామంలో గడి పిన తరువాత కాలు దురద పెట్టింది. అందుచేత అతను మళ్ళీ రాజధానికి తిరిగి వచ్చాడు. నగరమంతా విచార సూచకంగా ఉన్నది. ప్రతి ఇంటికీ నల్లగుడ్డలు వేల్లాడు తున్నాయి. అతను ఇందుకు కారణ మేమి టని అడగగా, "నీకు తెలీదా? ఇవాళ అర్ధ రాత్రికి సైతాను వచ్చి రాజకుమార్తెను ఎత్తుకు పోతున్నాడు. కొన్ని ఏళ్ళ క్రితం మన రాజుగారి చేత ఈ సైతాను ఒక కాగితం



పైన సంతకం చేయించుకున్నాడు. అందులో ఏమున్నదీ రాజుగారికి సరిగా అర్థం కాక, భ్రమపడి సంతకం పెట్టారు. తీరా చూస్తే రాజుగారి కూతుర్ని ఇవాళ రాత్రి సైతాను కివ్వాలని అందులో ఉన్నది," అని నగర వాసులు చెప్పారు.

వెంటనే బెప్పో రాజుగారి వద్దకు వెళ్ళి, "మీరు నాకు చేసిన మహోపకారానికి బదులుగా తమ కుమార్తెను సైతాను వాత పడకుండా తప్పిస్తాను," అన్నాడు.

"నీ సాహసం నాకు తెలుసుననుకో. అయినా ఈ సందర్భంలో నీవు గాని మరొ కరు గాని చేయగల దేమీ లేదు. మభ్యపడే



అయినప్పటికీ, కాగితం మీద సంతకం చేశాను," అన్నాడు రాజు.

"ఆ పాటి మోసం మనమూ చెయ్య వచ్చు. రాజకుమార్తె ఉండే గదికి పక్క గది నాకు ఏర్పాటు చెయ్యండి. అంతే, సైతాను నా గది దాటితే గాని రాజకుమార్తె గదికి పోవటానికి లేకుండా ఉండాలి. నా కొక బల్లా, మంచి దుడ్డుకర్రా, కలమూ, కాగితమూ, సిరాబుడ్డీ దయచేయించండి. మిగిలినదంతా నేను చూసుకుంటాను." అన్నాడు బెప్పో.

బెప్పో ప్రమాదం నివారించగలడని రాజు గారి కేకోశానా నమ్మకం లేదు. అయినా



ఆయన అతను కోరిన ఏర్పాట్లన్నీ చేశాడు. రాజకుమార్తె ఉండే గదికి పక్క గదిలో చేరి, బల్ల మీద తన సంచీని మూతి విప్పి సిద్ధంగా ఉంచి, గవాక్షం తెరిచి, దాని వద్ద బెప్పో నిలబడి ఉన్నాడు.

సరిగా అర్ధ రాత్రివేళ భూమి కంపించింది. మెరుపులు మెరిశాయి, ఉరుములు విన వచ్చాయి. అంతటా గంధకం వాసన వ్యాపించింది. రాజభవనంలోకి రాలుడు నక్షత్రం లాగా దూసుకు వస్తున్న సైతానును "దూకు" అని బెప్పో అనేసరికి, సైతాను సూటిగా వచ్చి అతని సంచీలో పడి పోయాడు. వెంటనే బెప్పో సంచీ మూతి బిగించాడు.

సంచీలో చిక్కిన సైతాను కాస్సేపు గర్జించి మౌనం వహించిన మీదట బెప్పో, "ఏం ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"అది నీకు సంబంధించిన విషయం కాదు," అన్నాడు సైతాను సంచిలో నుంచి.

"పూర్తిగా నాకు సంబంధించిన విషయం. నీవు రాజుగారి కుమార్తెను కాజేసుకు పోదామని వచ్చావు; నీ ప్రయత్నం పడగొట్టాలని నేను వచ్చాను! రాజకుమార్తె జోలికి రానని మాట ఇయ్యి. నిన్ను సంచీలో నుంచి బయటికి రానిస్తాను," అన్నాడు బెప్పో.



''అదంతా వట్టి మాట. ఇవాళ అర్ధ రాత్రి దాటి నప్పటి నుంచీ రాజకుమార్తె నా సొత్తు. అలా అని రాజుగారు నాకు పత్రం రాసి సంతకం చేసి ఇచ్చాడు,'' అన్నాడు సైతాను.

''ఆ సంగతి నాకు తెలుసు. ఆ ఒప్పందం చించేస్తావా, లేదా? ఆఖరుసారి అడుగు తున్నాను,'' అన్నాడు బెప్పో.

''నా వ్యవహారాలలో జోక్యం కలిగించు కోకు. ముందు నన్ను సంచీ నుంచి బయటికి రానీ,'' అన్నాడు సైతాను.

''సరే అయితే!'' అని బెప్పో దుడ్డు కర్రతో సంచీని బాదసాగాడు.

నరకలోకానికి ప్రభువైన సైతాను తన లోకంలో శరీరబాధలకు అతీతుడు. కాని అతను మానవ లోకానికి రావాలంటే మానవ సహజమైన గుణాలు గల శరీరాన్ని ధరించి మరీ రావాలి. అందుచేత సైతానును దుడ్డు కర్ర దెబ్బలు తీవ్రంగా బాధ పెట్టాయి. ఆ బాధతో సైతాను అరిచాడు, ఆక్రోశించాడు, చివరకు కాళ్ళ బేరానికి వచ్చి, తనను సంచీలో నుంచి పైకి రానిచ్చినట్టయితే రాజకుమార్తె జోలికి రానన్నాడు.

''నీవు పత్రాలపై సంతకాలు చేయించు కునేవాడివి. నీ నోటి మాటకు విలువ లేదు.




నేను పత్రం తయారుచేస్తాను. నీ చెయ్యి బయట పెట్టి దాని పైన సంతకం చెయ్యి. ఆ తరవాతనే నిన్ను వదిలిపెట్టేది," అంటూ బెప్పో ఒక పత్రం తయారుచేసి దానిపై సైతాను చేత సంతకం చేయించి, ఆ తరవాత సైతానును సంచీ నుంచి పైకి రానిచ్చాడు. గంధకం వాసనలు వెదజల్లుతూ ఒక్క మెరుపు మెరిసింది; సైతాను గదిలో నుంచి నిష్క్రమించాడు.

తరువాత రాజుగారూ, ఆయన కుమార్తె, కొలువులో వున్నవాళ్ళూ తన చుట్టూ చేరి తెగ మెచ్చుకుంటూంటే బెప్పో సిగ్గుతో తల వంచేసుకున్నాడు. అతని గౌరవార్థం రాజు




గారు బ్రహ్మాండమైన విందు చేసి అతన్ని సాగనంపాడు.

మళ్ళీ బెప్పోకు దేశాటన మొహం మొత్తింది. అతను ఒక చోట స్థిరపడ దలుచుకుని తనకు నచ్చే చోటు కోసం అంతటా వెతికి, చివరకు ఒక నది ఒడ్డున ఒక అందమైన కుటీరం చూశాడు. దాని చుట్టూ అందమైన పూలతోటా, పళ్ళ తోటలూ ఉన్నాయి.

ఆ కుటీరంలో అతను స్థిర నివాసం ఏర్పాటు చేసుకుని, దేశాటనలు మానేసి, బతికి ఉన్నంత కాలమూ అక్కడే సుఖంగా ఉండ నిశ్చయించాడు.

చాలా ఏళ్ళు గడిచాయి. అతనికి జీవితం హాయిగా జరిగింది. ఒక నాడతని వద్దకు ఒక కొత్త వ్యక్తి వచ్చాడు. అతను నల్లగా, ప్రశాంతంగా, విచారవదనుడై ఉన్నాడు.

''ఎవరు మీరు?'' అని బెప్పో అతణ్ణి అడిగాడు.

''మృత్యువును,'' అని ఆ వ్యక్తి జవాబు చెప్పాడు.

''ఓహో, అలా అయితే—దూకు!'' అంటూ బెప్పో తన సంచీ మూతి విప్పాడు. మృత్యువు అందులోకి దూకి, ఏణ్ణర్థం పాటు అందులోనే ఉండిపోయాడు.

అంత కాలమూ బెప్పో మృత్యువును ఏ విధంగానూ బాధించలేదు; మీదుమిక్కిలి మృత్యువుతో స్నేహపూర్వకంగా మాట్లాడాడు. మృత్యువే అతన్ని భయపెట్టీ, అతనితో వాదించీ, అతన్ని బతిమాలీ సంచీలో నుంచి బయటపడ యత్నించాడు. బెప్పో అందుకు మాత్రం సమ్మతించలేదు.

ఆ ఏణ్ణర్థం కాలంలోనూ లోకంలో ఒక్క ప్రాణి కూడా చావలేదు. ఇవాళో, రేపో, ఇంకో గంటకో పోతారనుకున్నవారు అలా జీవించే ఉండిపోయారు. ఎన్నో ప్రమాదాలూ, యుద్ధాలూ జరిగాయి, కాని ఒక్కరూ చావటం జరగలేదు.

మృత్యువు బెప్పోకు ఎన్ని విధాలో చెప్పి చూశాడు: చావు లేకుండా లోకయాత్ర సాగదు; అతి వృద్ధు లుంటారు, దీర్ఘ వ్యాధులు గలవా రుంటారు, దుర్భరమైన జీవితాలు గడిపే వారుంటారు — వారికి చావే విమోచన మార్గం; చావనేది లేకుండా ప్రాణులు పుట్టుకొస్తూంటే వాటికి చోటు కూడా ఉండదు. ఈ మాటలలో సత్య మున్నదని బెప్పో ఒప్పుకోవలసి వచ్చింది. తాను పిలిస్తే తప్ప తన జోలికి రాకుండా మాట తీసుకుని, బెప్పో మృత్యువును సంచీ నుంచి విడుదల చేశాడు.

సంచీ నుంచి విడుదల అవుతూనే మృత్యువు దిగబడిపోయిన తన పనిని గబగబా పూర్తి చేయసాగాడు. ప్రపంచ మంతటా యుద్ధాలూ, విషవ్యాధులూ, ఇతర పీడలూ చెలరేగి, జనం కొన్ని మాసాలపాటు కోట్ల సంఖ్యలో చచ్చారు.

ఆ తరువాత బెప్పో ఎంతోకాలం బతికాడు. అతనికి జీవితం పైనే రోత పుట్టింది. అతని మిత్రులే గాక, వారి పిల్లలూ, మనమలూ కూడా పోయారు. రాజుగారూ, ఆయన కూతురూ కూడా ఏనాడో పోయారు. అందు చేత అతను, తనను తీసుకుపొమ్మని తన నౌకరు ద్వారా మృత్యువుకు కబురుపెట్టాడు.




"నేనా మనిషి ఉండే చాయలకే రాను!" అని మృత్యువు జవాబు చెప్పాడు.

"ఈ మృత్యువు ఎంత కృతఘ్నుడు! అతన్ని సంచీలోనే ఉంచినట్టయితే రోగం వదిలేది." అనుకున్నాడు బెప్పో.

మృత్యువు తన శరీరం నుంచి ఆత్మను వేరుచేయ నిరాకరించాడు గనక తాను స్వర్గానికో, నరకానికో బొందితో పోవటం తప్ప మరొక మార్గం లేదని బెప్పో నిర్ణయించుకున్నాడు. తనకు స్వర్గంలో చోటుంటుందని అతనికి తోచలేదు. అందుచేత తిన్నగా నరకానికి వెళ్ళి, నరకద్వారం తలుపులు తట్టాడు.

నరకంలోకి ప్రవేశించ గోరేవాడు బెప్పో అని తెలియగానే సైతాను భటులతో, "వాణ్ణి లోపలికి రానియ్యకండి. బాగా తన్ని యిక్కణ్ణించి పంపెయ్యండి!" అన్నాడు. వాళ్ళు అలాగే చేశారు.

ఇక తనకు స్వర్గం తప్ప వేరే గతి లేదని నిర్ణయించుకుని బెప్పో స్వర్గానికి వెళ్ళి, అక్కడి ద్వారపాలకుడితో తనను లోపలికి పోనివ్వమన్నాడు.

"ఈశ్వరుడు ఏమంటాడో కనుక్కుని వస్తాను," అంటూ స్వర్గ ద్వారపాలకుడు లోపలికి వెళ్ళాడు. ఆ సమయంలో బెప్పో స్వర్గం ప్రహరీ గోడ మీదుగా తన టోపీని లోపలి ఉద్యానంలో పడేటట్టుగా గిరవాటు వేశాడు.

ద్వారపాలకుడు తిరిగి వచ్చి, "నిన్ను ఈశ్వరుడు లోపలికి రానివ్వ వద్దన్నాడు. నీవు చేసిన ఒకే ఒక మంచి పని సైతానును తన్నటం. అంత మాత్రాన నీకు స్వర్గార్హత లేదు. నీ స్థితి, పాపం, విచారకరంగానే ఉన్నది. కాని చట్టాన్ని ఉల్లంఘించటానికి లేదు గద!" అన్నాడు.

"నిజమే. నేను నా తిప్పలు పడతాను. నా టోపీ లోపల పడిపోయింది. అది కాస్త తెచ్చుకోనివ్వండి," అన్నాడు బెప్పో.

"మంచిది. తీసుకు వెళ్ళు," అన్నాడు ద్వారపాలకుడు.

బెప్పో లోపలికి వెళ్ళి తన టోపీ మీద కూర్చుని కదలలేదు. "నా ఆస్తి నేనాక్రమించుకున్నాను. చట్ట ప్రకారం ఆస్తి కన్న పవిత్రమైన దేమున్నది? నన్ను మీరు దీని పై నుంచి కదిలించలేరు." అన్నాడతను ద్వారపాలకుడితో.

విషయం ఈశ్వరుడి దాకా వెళ్ళింది.

"స్వర్గంలో అంగుళం మేర దొరికినా స్వర్గమంతా దొరికినట్టే. ఎందుకంటే స్వర్గంలో విభాగాలు లేవు. వాణ్ణి స్వర్గంలోనే ఉండనివ్వండి," అన్నాడు ఈశ్వరుడు.





# అత్తా-కోడలు

ఒక ఊళ్ళో ఒక పెద్దమ్మ. ఆ పెద్దమ్మ కొక కొడుకు. పెద్దమ్మ కొడుక్కి పెళ్ళీడు వచ్చింది. పెద్దమ్మ తన కొడుక్కి మంచి అందమైన పిల్లను చూసి పెళ్ళి చేసింది. పెద్దమ్మ కోడలు కొద్ది రోజుల్లో ఈడేరి కాపరానికి వచ్చింది.

"అత్త లేని కోడలు త్తమురాలు!" అని సామెత. అందుచేత పెద్దమ్మ కోడలు తన అత్తగారు పోతే తానూ మొగుడూ హాయిగా ఉండొచ్చు గదా అనీ, తనను అంతా మంచిది అనుకుంటారు గదా అనీ అనుకున్నది.

అందుకని ఆమె ఒకనాడు పెద్దమ్మతో, "అత్తా, అత్తా! నేను కాపరాని కొచ్చాను గదా, ఇంటి పనులన్నీ నేనే చేసుకుంటాను గదా, ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది.

"ఒసే, ఒసే, అలాగే చచ్చిపోతాను గాని, నాకు ఒక్క ముచ్చట తీరలేదే. నీ కడుపున ఒక నలుసు పుడితే చూసి మరీ పోతానే!" అన్నది పెద్దమ్మ.

"ఇంతే గదా," అనుకుని పెద్దమ్మ కోడలు సంతోషించింది.

కొద్ది కాలానికే పెద్దమ్మ కోడలు కడుపుతో ఉండి ఒక కొడుకును కన్నది. పెద్దమ్మ మనవణ్ణి ఎత్తి ఎంతో సంతోషించింది.

"అత్తా, అత్తా! మనవణ్ణి కళ్ళ చూశావు గదా. ఇక చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"కాస్త ఓపిక పట్టవే! మనవడి అచ్చట్లూ ముచ్చట్లూ చూసుకుని పోతాలే. వాడికి పుట్టువెంట్రుకలు తీసి అక్షరాభ్యాసం అయే దాకా ఉండి మరీ పోతా," అన్నది పెద్దమ్మ.

అయిదేళ్ళు గడిచాయి. పెద్దమ్మ మనవడి అక్షరాభ్యాసం చేశారు.

"ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

ఆర్. సక్కుబాయి

"మనవడికి కాస్త జంఝప్పోగు పడ నీవే, పోతానూ!" అన్నది పెద్దమ్మ.

కొంత కాలానికి పెద్దమ్మ మనవడికి ఉపనయనం చేశారు.

"ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"ఏమయిందో అయింది. మనవడి పెళ్ళి కళ్ళారా చూసి పోతానే," అన్నది పెద్దమ్మ.

పెద్దమ్మ మనవడికి పెళ్ళి ఈడు వచ్చింది. మంచి సంబంధం చూసి పెళ్ళి చేశారు.

"మనవడి పెళ్ళి కూడా చూశావు. ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"మరేంలేదు గాని, మనవడూ వాడి భార్యా చిలకాగోరింకలల్లే కాపరం చేస్తుంటే చూసి మరీ పోదామని ఉన్నదే!" అన్నది పెద్దమ్మ. పెద్దమ్మ మనవడి భార్య కాపరాని కొచ్చింది. పెద్దమ్మ కోడలు కూడా అత్తగా రయింది.

పెద్దమ్మ తన కోడలుతో, "ఏమే, నా కోరిక లన్నీ తీరాయే! ఇక చచ్చిపోదా మనుకుంటున్నాను. మరి నీ కోడలు కూడా కాపరానికి వచ్చిందిగా, నువు మాత్రం దేనికీ? ఇద్దరమూ కలిసే చద్దాం పట్టు!" అన్నది.

పెద్దమ్మ కోడలు గుండె గుభేలుమన్నది. "పెద్ద చిక్కే పెట్టుకున్నానురా, భగవంతుడా! ఇప్పుడు బయటపడడ మెలాగ?" అనుకుని ఆమె పెద్దమ్మతో, "మీరు చచ్చి పోతానంటే నా కేదోలాగుంది, అత్తయ్యా! మీరు చచ్చిపోవద్దు. మీ కేం తక్కువ? ఇంటి పనులన్నీ నా కోడలు చూసుకుంటుందిగా. మీ పనులన్నీ నేను చూస్తాను. మీ కేం తక్కువయిందీ? మీ రెందుకు చచ్చిపోవాలీ?" అన్నది.

పెద్దమ్మ కోడలి మార్పుకు నవ్వుకుని కోడలి చేత సమస్తమైన ఉపచారాలూ చేయించుకుంటూ హాయిగా ఉన్నది.





# మాయదారి ముసలిది

## 4

కొత్వాలు అహ్మద్ కష్టాలు అంతటితో తీరలేదు. జీనాబ్ చేసిన మోసం కారణంగా అహ్మద్, తన నలభైమంది భటులతో బాటు తన దుస్తులను పోగొట్టుకుని, లోదుస్తులు ధరించి సిగ్గుతో తలవంచుకుని వీధినపడి వస్తూ, రెండో కొత్వాలైన హసన్ కంటనే పడ్డాడు.

హసన్ అహ్మద్‌కు పట్టిన దుస్థితికి లోలోపల సంతోషించి, పైకి మటుకు అమాయకంగా, "ఇదేమిటి, అహ్మద్? ఉదయం పూట, అందులోనూ ఈ చలిగాలిలో ఇటువంటి దుస్తులతో తిరగటం ఆరోగ్యానికి మంచిదా?" అని అడిగాడు.

"కష్టాలు అందరికీ వస్తాయి, హసన్. విధిని తప్పించుకోవటం మహామహా వాళ్ళకే సాధ్యం కాదు. నేను ఒక బాలిక చేత మోసపోయాను. నీకు దాని ఆచూకీ ఏమైనా తెలుసునా?" అన్నాడు అహ్మద్ దీనంగా.

"నాకు ఆ పిల్లా తెలుసు, దాని తల్లీ తెలుసు. వెళ్ళి పట్టుకోమంటావా ఏమిటి?" అన్నాడు హసన్.

"అది ఎలా సాధ్యమవుతుంది?" అని అహ్మద్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏముందీ? ఖలీఫా వద్దకు పోయి, ముసలిదాన్ని పట్టటం నీ వల్ల కాదని చెప్పు. ఆ పనికి నన్ను నియోగించమని ఖలీఫాను వేడుకో," అని హసన్ సలహా ఇచ్చాడు.

అహ్మద్ తన ఇల్లు చేరుకుని, దుస్తులు ధరించి, ఖలీఫా వద్దకు పోయి, ముసలిదాన్ని పట్టటానికి సమర్థుడు హసనే అని మనవి చేసుకున్నాడు.

ఖలీఫా హసన్‌ను పిలిపించి, "నీకు ఈ ముసలిది తెలుసునా? దాన్ని పట్టుకునే

ఆర్. నాగభూషణం




పని అహ్మద్ తన వల్ల కాదంటున్నాడు. నీకు చెబితే చెయ్యగలవా?" అని అడిగాడు.

"ముసలిదాన్ని ఎరుగుదును. అది ఈ దొంగతనా లన్నిటినీ ధనలోభంతో చేసిందని నేను అనుకోవటం లేదు. ఆమె తన శక్తి సామర్ధ్యాలను ఏలినవారికి చూపటానికే ఇదంతా చేస్తూ ఉండాలి. ఆమె తాను దొంగిలించిన వస్తువులన్నీ ఎవరివి వారికి ఇచ్చినమీదట తమ రామెను క్షమించాలి. అలా అభయం ఇచ్చేటట్టుంటే, నే నామెను తెచ్చి, మీ ఎదట హాజరు పెట్టగలను." అన్నాడు హసన్.

ముసలిది ఎవరి సొత్తు వారికి తిరిగి ఇచ్చే పక్షంలో ఆమెను శిక్షించనని ఖలీఫా అభయం ఇచ్చాడు.

హసన్ తిన్నగా దిలైలా ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. జీనాబ్ తలుపు తెరిచింది.

"మీ అమ్మను ఖలీఫా వద్దకు తీసుకు పోవటానికి వచ్చాను. ఆమెను ఖలీఫా పిలుస్తున్నాడు. ఆయన ఆమె కిచ్చిన అభయం ఇదుగో. మీ అమ్మ తస్కరించిన సామాను లన్నీ గుర్రాల మీదికి ఎత్తించు," అన్నాడు హసన్. దిలైలా మేడ దిగి వచ్చింది.

ఆమె దొంగిలించిన సరుకంతా గుర్రాల మీద వేయించారు. ఖలీఫా దగ్గిరికి వెళ్ళేందుకు దిలైలా తన కున్న దుస్తులలో కెల్లా మంచివి ధరించింది.

"నువు తీసుకున్న సామానంతా వచ్చి నట్టేనా?" అని హసన్ దిలైలాను అడిగాడు.

"అహ్మదూ, అతని భటులూ వేసుకున్న దుస్తులు తప్ప అంతా ఇచ్చేశాను. నిజానికి, ఆ దొంగతనంతో నాకు ఎలాంటి సంబంధమూ లేదు," అన్నది దిలైలా హసన్‌తో.

హసన్ నవ్వి, "అవునులే, అంతే. అది మరొకరి పని," అన్నాడు. ఇద్దరూ దర్బారు చేరుకున్నారు.

దిలైలాను చూడగానే ఖలీఫాకు ఆగ్రహావేశం వచ్చింది. ఆమె చేసిన దురంతాలు తలుచుకుని ఆయన, ఆమె తల నరికెయ్యమని భటులకు ఉత్తరు విచ్చాడు.

హసన్ ఆయనకు ఆయన ఇచ్చిన అభయం గుర్తు చేయవలసివచ్చింది. అప్పుడాయన శాంతించి, "నీ పేరేమిటి?" అని ఆమెను అడిగాడు.

"నా పేరు దిలైలా. నేను పావురాల టపా నడిపిన అధికారి భార్యను," అన్నది దిలైలా.

"నువు చాలా ప్రయోజకురాలిలాగా ఉన్నావు. వీరందరినీ ఎందుకు మోసం చెయ్యవలసివచ్చింది?" అని ఖలీఫా అడిగాడు.

దిలైలా ఖలీఫా ముందు మోకరించి, "ఏలినవారు నన్ను మన్నించాలి. నేను ధనాశతో ఈ దొంగతనాలు చెయ్యలేదు. నా భర్త నడుపుతూ ఉండిన పావురాల టపాను నేను నడుపుతానంటే ఏలినవారు అనుమతించారు కారు. కాని దొంగతనాలు చెయ్యటంలో ఘటికులైన ఈ హసన్, అహ్మద్‌లకు పెద్ద పదవు లిచ్చారు. వారికున్నపాటి సామర్థ్యం నాకు కూడా ఉన్నదని రుజువుచేస్తే పావురాల టపా నడిపే ఉద్యోగం నా కిప్పిస్తారేమోనన్న ఆశతో





ఇలా చేశాను," అన్నది. ఆమె మాటలు ఖలీఫాకు నమ్మదగినవిగానే తోచాయి.

ఆయన ఫిర్యాదీ లందరికీ వారి వారి సొత్తు ఇప్పించి, దిలైలా కేసి తిరిగి, "ఇంతకూ నువు కోరేదేమిటి?" అన్నాడు.

"నా భర్త చేసిన ఉద్యోగమూ, జీతమూ నాకు దయచేయించండి. పావురాల టపా నడిపే విధానమంతా నాకు పూర్తిగా తెలుసు. టపా పావురాలను పోషించినది నేనూ, నా కూతురూనూ. మేమే వాటికి ఉత్తరాలు కట్టేవాళ్ళం. పావురాల టపా నిమిత్తం ఏలినవారు పెద్ద దివాణం ఏర్పాటు చేసి, దాని రక్షణకుగాను నలభై మంది నీగ్రో బానిసలనూ, నలభై వేట కుక్కలనూ ఇచ్చారు. ఆ దివాణాన్ని నిర్వహించినది నా భర్త కాదు, నేను! అందుచేత ఆ పని నిర్వహించటం నాకు ఎంత మాత్రమూ అసాధ్యం కాదు," అని దిలైలా ఖలీఫాకు విన్నవించుకున్నది.

ఆమె కోరిక సక్రమమేనని ఖలీఫాకు తోచింది. దిలైలాను పావురాల టపా నిర్వాహకురాలుగా నియమిస్తూ ఆయన ఆజ్ఞాపత్రం తయారుచేయించాడు.

ఆ రోజే దిలైలా తన మకామును పావురాల టపా దివాణానికి మార్చి, తన ఇంటి సామాను యావత్తూ ఆ దివాణానికి తరలించింది. నలభై మంది నీగ్రో బానిసలూ దివాణానికి తిరిగివచ్చారు. నలభై వేట కుక్కలు కూడా వచ్చాయి. నీగ్రోలకు దిలైలా ఎర్రని జరీ దుస్తులు ఏర్పాటు చేయించింది. దివాణంలో నలభైఒక్క మేకు కొట్టించి, ఆ మేకులకు అహ్మద్ దుస్తులూ, నలభైమంది భటుల దుస్తులూ, తన కుమార్తె సాధించిన విజయానికి చిహ్నలుగా తగిలించింది.

ఆమె రోజూ మగదుస్తులు వేసుకుని, నెత్తి మీద వెండి పావురం గల బంగారు టోపీ ధరించి, రాజభవనానికి వెళ్ళి టపా చెయ్యి

పలసిన సందేశాలు తెస్తూ ఉండేది. తల్లి కూతుళ్ళకు రోజులు సుఖంగా వెళ్ళి పోతున్నాయి.

పై సంఘటనలు జరిగిన కొద్ది రోజులకు ఒక యువకుడు కైరోనగరం నుంచి బాగ్దాదు నగరానికి వచ్చాడు. వాడి అసలు పేరు అలీ. కాని వాడికి "పాదరసం" అనే సార్థకనామం ఉండేది. వాడు చాలా అందమైన యువకుడు, కాని గజదొంగ.

ప్రస్తుతం బాగ్దాదులో కొత్వాలు పదవిలో ఉన్న అహ్మద్ కైరోలో గజదొంగగా జీవిస్తున్నప్పుడు "పాదరసం" అహ్మద్ వద్దనే దొంగతనంలో శిక్షణ పొందాడు. అహ్మద్ కైరో వదిలి బాగ్దాదు చేరి, అక్కడ కూడా గజదొంగగా ఖ్యాతి సంపాదించుకుంటున్న కాలంలో ఈ అలీ కైరోలో దొంగల పెద్దగా పరిణమించాడు. అతను ఎన్నోసార్లు పట్టుబడి కూడా అవలీలగా తప్పించుకుపోవటం చేత అతనికి "పాదరసం" అన్న పేరు వచ్చేసింది.

"పాదరసం" అలీని బాగ్దాదుకు పిలిపించినవాడు కొత్వాలు అహ్మదే. దిలైలాను పట్టుకునే ప్రయత్నంలో జీనాబ్ చేతిలో దుర్భరమైన అవమానానికి గురి అయిన నాటి నుంచీ అహ్మద్‌కు ప్రతి క్షణమూ "పాదరసం" గుర్తుకు రాసాగాడు. కైరోలో





వాడు తనకు కుడి భుజం లాగుండేవాడు. వాడే తన పక్కన ఉంటే తనకా పరాభవం జరగకపోను. దిలైలా మీద తాను స్వయంగా పగ తీర్చుకునే అవకాశం ఇప్పుడు లేదు. ఇప్పు డామె హోదా తన హోదాకు ఏమీ తక్కువ కాదు. అందుచేత అహ్మద్ "పాదరసం" ద్వారా పగ తీర్చుకోదలచి, అతన్ని బాగ్దాదు నగరానికి పిలిపించాడు.

"పాదరసం" బాగ్దాదు నగరం చేరుతూనే అహ్మద్ ఇంటికి వచ్చాడు. అతన్ని చూడగానే అహ్మద్‌కు ప్రాణం లేచివచ్చినట్టయింది.



"తమ్ముడూ, నువు నా యింట కొన్నాళ్ళు రహస్యంగా ఉండాలి. నీతో ఒక రాచకార్యం ఉన్నది. అది పూర్తి అయాక నిన్ను నేను స్వయంగా ఖలీఫా వద్దకు తీసుకుపోయి, శిఫార్సు చేసి, మంచి ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నాడు అహ్మద్ పాదరసంతో.

అహ్మద్ ఇంట రెండు రోజులు రహస్యంగా గడిపిన మీదట "పాదరసం" బయటికి పోవాలని తహతహలాడాడు. అతనికి ఖైదులో ఉన్నట్టు, అనిపించింది. అందుచేత, మూడోనాడు అహ్మద్ రాజభవనానికి బయలుదేరి పోగానే, "పాదరసం", బాగ్దాద్ నగరం అంతా చుట్టబెట్టి వద్దామనే ఉద్దేశంతో ఇంటి నుంచి చల్లగా బయటికి వచ్చాడు.

"పాదరసం" వీధి వెంట కొద్దిదూరం వెళ్ళాడో లేదో, అతని కొక విచిత్ర దృశ్యం కంటపడింది. ఒక ముసలిది మగదుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ ధరించి, గుర్రం మీద వీధి వెంట పోతున్నది. ఆమె వెంట ఎర్ర జలతారు దుస్తులు ధరించిన నీగ్రోలు పోతున్నారు. ఆ ముసలిది దిలైలా. నీగ్రోలు ఆమె నౌకర్లు. ఆ ఉదయం దిలైలా రాజ



భవనానికి వెళ్ళి, పావురాల ద్వారా పంప పలసిన టపా అంతా పోగుచేసుకుని, తన ఇంటికి తిరిగి వెళ్ళిపోతున్నది.

దిలైలా "పాదరసం" అలీని చూసింది. చూసి, అతని అందానికి ఆశ్చర్యపడింది. కాని అతని కళ్ళలో ఆమెకు అహ్మద్ లక్షణాలు కొన్ని కనిపించాయి. దానికి కారణం ఉన్నది: అహ్మద్ శిష్యత్వం చెయ్యటంలో "పాదరసం" తనకు తెలియకుండానే అహ్మద్ లాగా చూడటమూ, ముఖాలు పెట్టటమూ నేర్చుకున్నాడు. అంతేగాక, "పాదరసం" అహ్మద్ ఇంటిదిక్కునుంచి రావటంకూడా దిలైలా గమనించింది.

ఆమె ఇల్లు చేరుకుని తన కుమార్తెకు తాను చూసిన యువకుణ్ణి వర్ణించి చెప్పి, "కొత్వాలు అహ్మద్ వీణ్ణి ఎక్కడి నుంచో పిలిపించాడని నా అనుమానం. వాడు నగరాన్ని వింతగా చూస్తున్నాడు. ఇక్కడి వాడు కాడు. కొత్తగా దిగాడు. ఏమైనా మనం మన జాగ్రత్తలో ఉండటం మంచిది," అన్నది.

"ఎంతెంత వాళ్ళని లక్ష్యపెట్టనిదానివి, మీసాలూ, గడ్డమూ సరిగా రాని ఈ కుర్రాణ్ణి గురించి అంత బెదురుగా మాట్లాడతావేం? ఇతగాడి సంగతి నేను చూస్తానుండు," అన్నది జీనాబ్.





ఆమె అందమైన దుస్తులు ధరించి, కళ్ళకు కాటుక పెట్టుకుని, మేలిముసుగు వేసుకుని, చేత సంచీ పట్టుకుని, మెరుపు కదులుతున్నదనిపించేటట్టు వీధిలోకి నడిచింది. ఆమె వీధి వెంట కొంతదూరం వెళ్ళాక ఒక దుకాణం దగ్గిర "పాదరసం" కనిపించాడు. తల్లి చేసిన వర్ణననుబట్టి జీనాబ్ అతన్ని గుర్తు పట్టింది. ఆమె అతన్ని రాచుకుంటూ ముందుకు వెళ్ళి, వెనక్కు తిరిగి, "కబోదిపక్షి!" అన్నది కోపంగా.

"పాదరసం" ఆమె కేసి చూసి, ఆమె అందానికి నిర్ఘాంతపోయాడు. అతను నవ్వుతూ, "ఏం చక్కదనం! ఎవరిదానివి?" అని అడిగాడు.

"ఒక వర్తకుడి కూతుర్ని. ఇంకో వర్తకుడి భార్యను. మీ ధోరణి చూడగా ఊరికి కొత్తలాగుంది. మీ బస ఎక్కడ?" అని అడిగింది జీనాబ్.

అహ్మద్ ఇంట తానుంటున్నది రహస్యంగా గనక, పాదరసం, "ఇంకా బస చూసుకోలేదు. చూడాలి," అన్నాడు.

"అయితే మా ఇంటికి రండి. మాది చాలా పెద్ద లోగిలి. నా భర్త దుకాణానికి వెళితే నేను ఒంటరిగా ఉంటాను," అన్నది జీనాబ్.

ఆమె ఆహ్వానాన్ని అందుకోవటం మంచిది కాదేమోనని "పాదరసం" శంకించాడు. కాని తనకు ఈ నగరంలో ఎవరూ తెలీదు. యాదృచ్ఛికంగా వీధిలో కనిపించిన ఆడమనిషి తనకు శత్రువై ఉండే అవకాశం లేదు. అందుచేత ఆమె వెంట వెళ్ళి, ఆమె తత్వం ఏమిటో తెలుసుకుందామని అతను అనుకున్నాడు.

జీనాబ్ అతన్ని చాలా వీధులు తిప్పి, ఒక పెద్ద భవనం ముందు ఆగి, తాళపు చెవి కోసం తన సంచీలో వెతకనారంభించింది. అది ఒక గొప్ప వర్తకుడి ఇల్లు.

ప్రస్తుతం ఆ ఇంట్లో ఎవరూ లేరు. వర్తకుడు ఉదయం ఇంటికి తాళం వేసి దుకాణానికి పోతాడు, రాత్రిదాకా తిరిగి రాడు. ఆ మాట జీనాబ్‌కు తెలుసు.

"అయ్యో, తాళంచెవి కాస్తా పారేసుకున్నాను. ఏం చెయ్యాలి? తాళం మీరేమైనా తియ్యగలరా?" అన్నది జీనాబ్.

అంత పెద్ద తాళాన్ని "పాదరసం" క్షణంలో తీశాడు. అతని హస్తలాఘవాన్ని బట్టి అతను గజదొంగనని జీనాబ్ రూఢి చేసుకున్నది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

"మీ రీ హాలులో కూర్చోండి. నేను బావి నుంచి నీరు తెచ్చి వంట చేస్తాను," అంటూ జీనాబ్ బిందె తీసుకుని దొడ్లోకి వెళ్ళింది.

కొంచెం సేపయాక దొడ్లో నుంచి జీనాబ్ కెవ్వున కేకపెట్టటం విని, ఏం జరిగిందో నని "పాదరసం" దొడ్లోకి వెళ్ళేసరికి, జీనాబ్ బావిలో నుంచి చేద పైకి లాగక, బావిలోకి తొంగి చూస్తూ కనిపించింది.

"ఏమయింది?" అని "పాదరసం" అడిగాడు.

"నా రవ్వల ఉంగరం! అయిదు వందల దీనారాలకు నా భర్త నిన్ననే కొని పెట్టాడు. అది కాస్తా బావిలో పడిపోయింది. నా భర్తకు తెలిస్తే చంపేస్తాడు!" అని జీనాబ్ లబలబలాడింది.

"ఇంతే గద! నేను దిగి తీస్తానుండు," అన్నాడు "పాదరసం".

అతను బావి మీద ఉన్న అడ్డదూలానికి మోకు కట్టి బావిలోకి దిగాడు. అతను ఉంగరం కోసం వెతకటానికి మోకు వదిలి నీటిలో మునుగగానే జీనాబ్ మోకు పైకి లాగేసి, "నిన్ను అహ్మద్ పైకి తీసే దాకా అందులోనే ఉండు!" అంటూ, అతని దుస్తులు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

—(ఇంకావుంది)



# మరికాస్త

ఒక షావుకారు బస్తీ నుంచి దండిగా సరుకులు తీసుకుని తన గ్రామానికి పోతూ, అలుపు తీరటానికి దారిలో ఒక చెట్టు కింద కూర్చున్నాడు. తిరిగి బయలు దేరేటప్పుడు మూట నెత్తి కెత్తు కోవటం షావుకారుకు సాధ్యం కాలేదు.

అటుగా ఒక కుర్రవాడు పోతుంటే షావుకారు వాణ్ణి ఆపి, "కాస్త మూట నెత్తి కెత్త తావా? నీకు కాస్త బెల్లం పెడతాను!" అన్నాడు.

"కాస్త బెల్లం కాదు, మరి కాస్త పెట్టాలి," అన్నాడు కుర్రవాడు.

సరేనని షావుకారు వాడి సహాయంతో మూట ఎత్తుకుని ఇల్లు చేరుకుని, బెల్లపు అచ్చులో చిన్న ముక్క తుంపి, కుర్రవాడి కివ్వబోయాడు.

"మరి కాస్త కావాలి," అన్నాడు కుర్రవాడు. షావుకారు ఇంకా పెద్ద పెళ్ళ తుంపి ఇవ్వబోయాడు.

"మరి కాస్త," అన్నాడు కుర్రవాడు.

తన దగ్గిర ఉన్న బెల్ల మంతా ఇచ్చినా కుర్రవాడు, "మరి కాస్త!" అంటున్నాడు. షావుకారు వాడి మీద అరవసాగాడు. "నేను మరికాస్త ఇవ్వమని అడిగాను. నువు ఇస్తా నన్నావు—మాట తప్పకు," అన్నాడు కుర్రవాడు.

దారే పోయే పెద్ద మనిషి ఆగి ఈ వివాదమంతా విని, షావుకారును ఊరుకోమన్నాడు. తరవాత ఆయన ఒక చిన్న బెల్లం ముక్కా, ఒకటి కాస్త పెద్ద ముక్కా కుర్రాడికి చూపించి, "ఇందులో ఏది మరికాస్త అంటావు?" అన్నాడు.

కుర్రవాడు పెద్ద ముక్క చూపించాడు.

"అయితే అది తీసుకుని నీ దారిన నువు పో," అన్నాడు పెద్ద మనిషి. కుర్రవాడి ఆటకట్టింది.

—సిహెచ్. నారాయణమూర్తి.





# గండభేరుండం

పూర్వం ఒక రాజుండేవాడు. ఆ రాజు కొక కూతురు. ఆమెకు ఎప్పుడూ జబ్బుగానే ఉండేది. ఎన్ని వైద్యాలు చేసినా ఆ జబ్బు నయం కాలేదు.

"పవిత్రమైన దానిమ్మకాయ తింటే గాని ఈ పిల్ల కోలుకోదు," అని ఒక దైవజ్ఞుడు చెప్పాడు. కాని పవిత్రమైన దానిమ్మ కాయలు ఎలా ఉంటాయో ఎవరికీ తెలియలేదు.

రాజుండే ఊళ్ళోనే ఒక భూస్వామి ఉన్నాడు. ఆ మనిషి సాధారణంగా నిజమన్నది నోట చెప్పి ఎరగడు. ఆయనకు ముగ్గురు కొడుకులున్నారు. పెద్దవాళ్ళిద్దరూ గడుసువాళ్ళు. అందుచేత వాళ్ళు కూడా సాధ్యమైనంత వరకు నిజం చెప్పేవాళ్ళు కారు. మూడోవాడు శేఖరుడు వాళ్ళకు విరుద్ధం. వాడు ఎప్పుడూ నిజమే చెప్పేవాడు. అందుచేత తండ్రీ, అన్నలూ కూడా శేఖరుణ్ణి చవట కింద జమ కట్టేవారు.

ఇలా ఉండగా రాజు చాటింపు వేయించాడు—పవిత్రమైన దానిమ్మలు తెచ్చి తన కూతురికి ఆరోగ్యం చేకూర్చిన వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు.

"దానిమ్మలకు పవిత్రమేమిటి, అపవిత్రమేమిటి? మన దొడ్లో ఉన్నవి భేషయిన దానిమ్మలు. ఒరే పెద్దవాడా, నువు రెండు దానిమ్మకాయలు తీసుకుపోయి రాజకుమార్తెను పెళ్ళి చేసుకో!" అన్నాడు భూస్వామి తన పెద్ద కొడుకుతో.

భూస్వామి పెద్ద కొడుకు రెండు దానిమ్మకాయలు కోసి, బుట్టలో పెట్టుకుని రాజభవనానికి బయలుదేరాడు. దారిలో ఒక ఇనప చొక్కా మనిషి కనిపించి, "ఏమిటా బుట్టలో?" అని అడిగాడు.

"కప్పలు!" అన్నాడు వాడు.

"సరే, అంతే కావాలి," అన్నాడు ఇనప చొక్కా మనిషి.

వి. సుదర్శనరావు



భూస్వామి పెద్ద కొడుకు రాజభవనానికి వెళ్ళి, రాజకుమార్తె కోసం దానిమ్మలు తెచ్చానని బుట్ట మూత తీసేసరికి రెండు గొడురుకప్పలు బయటికి దూకాయి. రాజభటులు వాణ్ణి తన్ని పంపారు.

రెండో రోజు భూస్వామి రెండో కొడుకు దానిమ్మలతో బయలుదేరాడు. ఇనపచొక్కా వాడు కనబడి, "ఏమిటా బుట్టలో?" అన్నాడు.

"పీతలు!" అన్నాడు రెండోవాడు.

"అంతే కావాలి," అన్నాడు ఇనప చొక్కావాడు.

రెండోవాడు రాజభవనానికి వెళ్ళి బుట్ట తెరిచేసరికి, అందులో రెండు పీతలు అటూ ఇటూ తిరుగుతున్నాయి. రాజభటులు వాణ్ణి కూడా తన్ని పంపారు.

మూడోవాడు శేఖరుడు తాను కూడా పోతానన్నాడు.

"నీ అన్నల వల్ల కాని పని, నీ వంటి చవట వల్ల అవుతుందా? నువు కూడా వెళ్ళి తన్నులు తినిరా!" అన్నాడు తండ్రి.

శేఖరుడు రెండు దానిమ్మకాయలు బుట్టలో పెట్టుకుని బయలుదేరాడు.

ఇనప చొక్కావాడు కనపడి, "ఏమిటి బుట్టలో?" అని అడిగాడు.

"రాజకుమార్తె చికిత్సకు దానిమ్మ కాయలు!" అన్నాడు శేఖరుడు.

"అంతే కావాలి," అన్నాడు ఇనపచొక్కావాడు. శేఖరుడు రాజభవనం చేరి బుట్టతెరిస్తే అందులో ధగధగలాడుతూ రెండు దానిమ్మ కాయలున్నాయి. రాజభటులు వాటిని రాజకుమార్తెకు పంపారు. కొద్ది సేపట్లో రాజకుమార్తె పూర్ణారోగ్యంతో చెంగు చెంగున ఎగురుకుంటూ తండ్రి వద్దకు వచ్చింది.

"నాకు రాజకుమార్తె నిచ్చి పెళ్ళి చెయ్యండి," అన్నాడు శేఖరుడు రాజుతో.

"అప్పుడేనా? నువు గండభేరుండం ఈక పట్టుకురా. అప్పుడే నీకూ, నా కూతురికీ పెళ్ళి," అన్నాడు రాజు.

"అలాగే తెస్తాను!" అంటూ శేఖరుడు కదిలాడు.

"పీడ పీడ వదిలింది!" అని సంతోషించాడు రాజు.

శేఖరుడు గండభేరుండ లంక కేసి బయలుదేరి, ఆ రాత్రికి ఒక ఊరు చేరి, ఆ ఊరి రాజుగారింట ఆ రాత్రి అతిథిగా ఉన్నాడు.

"నువు గండభేరుండాన్ని చూడబోతున్నావా? దానికి తెలియనిదంటూ ఉండదుట. మా ఖజానా తాళపు చెవి కనిపించటం లేదు. అది ఎక్కడ ఉన్నదో కాస్త కనుక్కుందూ!" అన్నాడు ఆ రాజు.

శేఖరుడు సరేనన్నాడు. మర్నాడు రాత్రికి అతను మరొక రాజుగారింట చేరాడు.

"నువు గండభేరుండాన్ని కలుసుకున్నప్పుడు మా అమ్మాయి జబ్బుకు మందేమిటో కొంచెం తెలుసుకుందూ!" అన్నాడు ఆ రాజుగారు.

సరేనన్నాడు శేఖరుడు.

మూడోనాడు మధ్యాన్నానికల్లా అతను సముద్రతీరాన్ని చేరుకున్నాడు. గండభేరుండ లంక సముద్రంలో నాలుగుమైళ్ళ దూరాన ఉన్నది. ఒక రాక్షసుడు మనుషులను ఎత్తుకుని సముద్రం దాటిస్తూ ఉంటాడు.





"ఎవరబ్బాయీ నువు? ఇక్కడి కెందుకు వచ్చావు? గండభేరుండం నిన్ను నిష్కారణంగా తినేస్తుందే! వెంటనే వెళ్ళిపో!" అన్నదా ఆడమనిషి.

"నే నింతదూరం వచ్చింది వెళ్ళిపోవటానికా, తల్లీ? నాకు గండభేరుండం ఈక కావాలి. అదీ కాక నేను ముగ్గురి అనుమానాలకు సమాధానాలు తెలుసుకుని గాని వెళ్ళటానికి లేదు," అంటూ శేఖరుడు తన కథ అంతా చెప్పి, ఇద్దరు రాజులూ, రాక్షసుడూ అడిగిన ప్రశ్నలు కూడా చెప్పాడు.

ఆమె శేఖరుణ్ణి భద్రంగా ఒక చోట దాచింది.

ఆ రాక్షసుడు శేఖరుణ్ణి గండభేరుండ లంకకు తీసుకుపోతూ, శేఖరుడు వెళుతున్న పని తెలుసుకుని, "మనుషులను సముద్రం దాటించలేక చచ్చిపోతున్నాను. నాకీ పని ఎలా తప్పుతుందో గండభేరుండాన్ని అడిగి తెలుసుకుందూ!" అన్నాడు.

శేఖరుడు సరే నన్నాడు. లంక మీద దిగుతూనే అతను దూరాన కనిపించే కోటకు బయలుదేరాడు. అది గండభేరుండం ఉండే కోట.

ఆ కోటలో ఆ సమయానికి గండభేరుండం లేదుగాని, శేఖరుడికి ఒక ఆడ మనిషి కనిపించింది.

కొద్దిసేపటికి గండభేరుండం వచ్చి చేరింది. చేరుతూనే, "నరవాసన! ఎవరన్నా వచ్చారా ఏం?" అన్నది.

"అవును. ఎవరో కుర్రాడు వచ్చాడు. తమాషాగా వార్తలు చెప్పాడు. నువు వస్తే నిష్కారణంగా చంపేస్తావని పంపేశాను," అన్నది స్త్రీ.

"ఏం చెప్పాడు ఆ కుర్రాడు?" అన్నది గండభేరుండం.

"ఒక రాజు ఖజానా తాళంచెవి పోయిందట. డబ్బుండి కూడా నానా అగచాట్లూ పడుతున్నాడు," అన్నది స్త్రీ.

"మూఢుడు! వాడు పారేసుకున్న తాళం చెవి సామానుకొట్టు గడప పక్కనే ఉన్నది. ఇంకేం చెప్పాడు?" అన్నది గండభేరుండం.

"మరో రాజు కూతురికి ఏదో జబ్బట. ఏం మందిచ్చినా నయం కాదట," అన్నది స్త్రీ.

"ఆ పిల్ల వెంట్రుకల తుట్టెలో పాము గుడ్లు పెట్టింది. వెంట్రుకలతుట్టె మెట్ల కింద ఉన్నది. ఆ గుడ్లు తీసేస్తే ఆ పిల్ల రోగం కుదురుతుంది." అన్నది గండభేరుండం.

"సముద్రంలో మనుషులను దాటిస్తాడే ఆ రాక్షసుడు తన కా పని ఎట్లా తప్పుతుందో గదా అని ఏడుస్తున్నాడట!" అన్నది స్త్రీ.

"వాడి మొహం! ఒక మనిషిని నడి సముద్రంలో వదిలేస్తే సరి!" అన్నది గండభేరుండం.

తరవాత గండభేరుండం నిద్రపోయింది.

స్త్రీ శేఖరుణ్ణి బయటికి తీసి, గండభేరుండం ఈక ఒకటి పీకి ఇచ్చి, "ఇక నువు వెళ్ళిపో!" అన్నది.

శేఖరుడు సముద్రతీరానికి రాగానే రాక్షసుడు, "గండభేరుండం నా మాట ఏమన్నది?" అని అడిగాడు.

"ముందు సముద్రం దాటించు. తరవాత చెబుతాను," అన్నాడు శేఖరుడు. ఇవతలి ఒడ్డు చేరి అతను రాక్షసుడితో,



"ఈ సారి ఇటుగా వచ్చే మనిషిని నడి సముద్రంలో వదిలెయ్యి. ఆ తరవాత నీ క పని వుండదు," అన్నాడు.

తరవాత అతను రెండో రాజున్న ఊరు చేరి, "మీ మెట్ల కింద ఒక వెంట్రుకల తుట్టె ఉన్నది చూడండి. అందులో పాము గుడ్లు ఉన్నాయి. వాటిని ఆ తుట్టె నుంచి తీసేస్తే మీ అమ్మాయి కి ఏ రోగమూ ఉండదు," అని రాజుకు చెప్పాడు.

తన కుమార్తె ఆరోగ్యవతి కాగానే రాజు సంతోషించి శేఖరుడికి సంచీ నిండా బంగారమూ, ఆవులమందా, గొర్రెలమందా, మేకలమందా బహుమానం ఇచ్చాడు. అలాగే ఇంకో రాజు కూడా తన ఖజానా తాళపుచెవులు దొరకగానే శేఖరుడికి బంగారమూ, ఆవులూ, గొర్రెలూ, మేకలూ బహుమానం ఇచ్చాడు.

ఈ బహుమానా లన్నీ వెంటబెట్టుకుని, శేఖరుడు తన దేశానికి చేరుకున్నాడు. అతను రాజుగారిని కలుసుకుని, గండభేరుండం ఈక ఇచ్చాడు.

"గట్టివాడివే! ఈ బహుమానాలన్నీ ఎలా సంపాదించావు?" అన్నాడు రాజు. శేఖరుడు తెచ్చిన బంగారమూ, మందలూ చూసి రాజుకు కన్నుకుట్టింది.

"గండభేరుండాన్ని చూసి వచ్చినవాడికి ఆ మాత్రం లాభం వుండదా?" అన్నాడు శేఖరుడు వివరాలేమీ చెప్పకుండా.

ఆ రోజే రాజు తాను కూడా గండభేరుండాన్ని చూడటానికి బయలుదేరాడు. ఆయన సముద్రాన్ని చేరేసరికి రాక్షసుడు, అటుగా ఎవరు వస్తారా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. వాడు రాజును ఎత్తుకుని సముద్రం దాటుతూ, నడి సముద్రంలో రాజును వదిలేసి, తన దారిన తాను ఎటో వెళ్ళిపోయాడు.

రాజు పోయాడన్న వార్త తెలియగానే శేఖరుడు రాజకుమార్తెను పెళ్ళాడి, తానే సింహాసనం ఎక్కాడు.






## 19. సుభద్రా వివాహం

ద్వారకలో వారందరూ అంతర్ద్వీపంలో మహోత్సవం చూడబోవటం వల్ల అర్జునుడు సుభద్రను నిరాటంకంగా పెళ్ళాడటానికి అవకాశం ఏర్పడింది.

అందుకని అర్జునుడు, తనకు సేవలు చేస్తున్న సుభద్రతో, "తండ్రిగాని, అన్నగాని కన్యాదానం చేయగా అగ్నిసాక్షికంగా జరిగేదే వివాహం. కాని మనం అలా పెళ్ళాడటానికి ఇప్పుడు అవకాశం లేదు. అయితే ప్రేయసీ ప్రియులుగా మనం ఈ రాత్రి గాంధర్వ వివాహం చేసుకోవచ్చు. అది క్షత్రియ ధర్మమే. అందుచేత మనం గాంధర్వ వివాహం చేసుకోవటం గురించి నీ ఉద్దేశమేమిటి?" అన్నాడు. దీనికి సుభద్ర జవాబు చెప్పక, తన అన్న అయిన కృష్ణుణ్ణి తలచుకుంటూ, కంట తడిపెట్టింది.

అర్జునుడి కోరిక తీరేటట్టు కనబడ లేదు. అతను ఇంద్రుణ్ణి స్మరించాడు. దాని ఫలితంగా ఆ రాత్రి ఇంద్రుడు తన భార్య అయిన శచీదేవినీ, అరుంధతినీ, నారదుణ్ణీ, వసిష్ఠుణ్ణీ, మరికొందరు దేవ ఋషులనూ, అప్సరసలనూ వెంట బెట్టుకుని, అర్జునుడున్న చోటికి వచ్చాడు.

అదే సమయానికి కృష్ణుడు, అంతర్ద్వీపంలో బలరాముడు మొదలైన వాళ్ళు నిద్రలో ఉండగా, అక్రూరుణ్ణీ, సాత్యకినీ, గదుణ్ణీ వెంట బెట్టుకుని అక్కడికి చేరాడు. అతని వెంట దేవకీదేవీ, రుక్మిణీ కూడా వచ్చారు.




ఇంద్రుడు కృష్ణుణ్ణి కుశల ప్రశ్నలు చేసి, "నా కొడుకైన అర్జునుడికి నీ చెల్లెలైన సుభద్ర నిచ్చి వివాహం చేయవలసింది," అని లాంఛనంగా అడిగాడు.

"అంతకన్న మాకు కావలిసిందేమిటి?" అన్నారు యాదవులు. కృష్ణుడు ఇంద్రుడికి తన సమ్మతి తెలిపాడు.

ఇంద్రుడు అర్జునుడి చేత మంగళ స్నానం చేయించి, దివ్యమైన పూలదండల తోనూ, బట్టలతోనూ, ఆభరణాలతోనూ అలంకరించి వివాహ మంటపానికి తెచ్చాడు.

ఈలోపుగా అరుంధతీ, శచీ, దేవకీ, రుక్మిణీ కూడా సుభద్రకు స్నానం చేయించి, వెలలేని ఆభరణాలతో అలంకరించి తెచ్చి, అర్జునుడి పక్కన కూర్చో బెట్టారు. దిక్పాల కుల సమక్షంలో, నారద వసిష్ఠాదులు సదస్యులుగా సుభద్రార్జునుల వివాహం శాస్త్రోక్తంగా జరిగింది. దేవతలు తమ లోకానికి వెళ్ళిపోయారు. యాదవులు అంతర్ద్వీపానికి తిరిగి వెళ్ళిపోయేటప్పుడు కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నువు ఇక్కడ ఇరవై రెండు రోజు లుండు. తరవాత ఈ రథం ఎక్కి సుభద్రతో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళి పో," అంటూ, సైన్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకా లనే నాలుగు గుర్రాలు గల రథాన్ని చూపాడు.

కృష్ణుడు చెప్పినట్టే అర్జునుడు ఇరవై రెండు రోజులూ ద్వారకలో గడిపి, "నా చాతుర్మాస్యవ్రతం ముగిసింది. బ్రాహ్మణ సమారాధన చేస్తాను. ఏర్పాట్లు చేయించు," అని సుభద్రతో అన్నాడు.

ఆ తతంగం ముగిసింది. కృష్ణుడి రథాన్ని ఆయుధాలతో సహా సిద్ధం చేయించమని అర్జునుడు సుభద్రను అడిగాడు. ఆమె అలాగే చేసింది. అర్జునుడు సుభద్రనూ, ఆమె చెలికత్తెలనూ రథంలో ఎక్కించుకుని, అతి వేగంగా ఇంద్రప్రస్థం వెళ్ళే మార్గాన బయలుదేరాడు.





బలరాముడు వారిని వారించి, కృష్ణుడితో, "అర్జునుడు ఎంత ద్రోహం చేశాడో చూశావా? నువ్వేమీ మాట్లాడవేం? ఈ అవమానం కన్న చావు మేలు. నువు సరేనంటే, నేను వెళ్ళి భూమిమీద కౌరవవంశం లేకుండా చేసి వస్తాను!" అని కటువుగా మాట్లాడాడు.

ఆ మాటకు కృష్ణుడు బలరాముడితో, "అర్జునుడు మన కిప్పుడు చేసిన మహాపచార మేమిటి? మనం సుభద్రకు అంతకన్న మంచి భర్తను ఎక్కడి నుంచి తెస్తాం? రాక్షస వివాహం ధర్మ విరుద్ధం కాదుగదా! మీరంతా వెళ్ళి అతన్ని యుద్ధంలో ఓడిస్తారా? అది ఇంద్రుడికి కూడా సాధ్యం కాదు. యుద్ధం చేసి అర్జునుడి చేతిలో ఓడి అపకీర్తి తెచ్చుకోవటమో, అతనితో రాజీపడి, మంచిగా సంబంధం కలుపుకోవటమో ఆలోచించండి. రెండవ పద్ధతే అన్ని విధాలా మేలు," అని చెప్పాడు.

కృష్ణుడి సలహాను యాదవు లందరూ మెచ్చుకున్నారు.

అర్జునుడు సుభద్రతో సహా ఇంద్రప్రస్థం చేరి, తల్లికీ, అన్నలకూ నమస్కరించి, ద్రౌపది అంతఃపురానికి వెళ్ళాడు. ద్రౌపది అతన్ని చూసి, "సుభద్రతో సరసాలాడుతూ ద్వారకలోనే ఉండక ఇక్కడి కెందుకు

ఇది యాదవుల కంట పడింది. "ఇదేమిటి? ఈయన సుభద్రను అపహరించుకు పోతున్నాడు. అడ్డపడి, సుభద్రను విడిపించండి!" అంటూ కొందరు యాదవ శూరులు అర్జునుడి పైన బాణాలు వేస్తూ వెంటబడ్డారు. అర్జునుడు వారిని తన బాణాలతో కొట్టి, తప్పించుకుని, రథాన్ని రైవతకాద్రి దాటించాడు. [అట్ట చివరి బొమ్మ.]

ఈ వార్త అంతర్ద్వీపం చేరింది. అర్జునుడే సుభద్రను ఎత్తుకు పోతున్నాడని తేలి పోయింది. అక్కడ ఉన్న యాదవ వీరులు, అర్జునుడి వెనక సేనను పంపి, అతన్ని ఓడించి, సుభద్రను తీసుకువద్దామన్నారు.





వచ్చావు? అసలే రాజులు నూతన ప్రియులు. అదీగాక, ఎంత దృఢమైన బంధాలైనా పాత పడిపోతే తెగిపోతాయి. ప్రేమలు చిరకాలం ఉండవు," అని ఈర్ష్యగా మాట్లాడింది. ఆమెను అర్జునుడు తగిన విధంగా ఓదార్చాడు.

అర్జునుడి సైగ గ్రహించి సుభద్ర కుంతీ దేవికీ, ద్రౌపదికీ నమస్కారం చేసింది. ద్రౌపది ఆమెను ఆపేక్షగా కౌగలించుకుని ఆశీర్వదించింది.

ఇంద్రప్రస్థంలో అందరూ సుఖంగా ఉండగా, కృష్ణుడు బలరాముణ్ణీ, అక్రూరుణ్ణీ, ఉద్ధవుణ్ణీ, సాత్యకీ, కృతవర్మా, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ మొదలుగా గల యాదవ ప్రముఖులనూ వెంట బెట్టుకుని, సుభద్రకు సారె తెచ్చాడు. ఈ సంగతి తెలియగానే ధర్మరాజు తన నలుగురు తమ్ములనూ ఎదురు పంపాడు. యాదవులు వైభవంగా ఇంద్రప్రస్థ నగరం ప్రవేశించారు.

యాదవులు తెచ్చిన వేలాది ఏనుగులనూ, రథాలనూ, గుర్రాలనూ, పాడి ఆవులనూ, కనకాభరణాలనూ స్వీకరించి, వచ్చిన వారందరికీ ఎదురు కానుక లిచ్చి, వారిని కొంతకాలం అతిథులుగా ఉంచుకున్నాడు ధర్మరాజు. తరవాత కృష్ణుడు తప్ప



మిగిలిన యాదవు లందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

(కాలక్రమాన సుభద్రకు అర్జునుడి వల్ల ఒక కొడుకు కలిగాడు. అతనికి అభిమన్యుడు అని పేరు పెట్టారు. అభిమన్యు డంటే భయంలేనివాడనీ, కోపంగలవాడనీ అర్థం. ద్రౌపది పాండవు లయిదుగురికీ అయిదుగురు కొడుకులను కన్నది. ప్రతివింధ్యుడూ, సుతసోముడూ, శ్రుతసోముడూ, శతానీకుడూ, శ్రుతసేనుడూ అని ఉపపాండవుల పేర్లు. వీరందరికీ అర్జునుడే ధనుర్విద్య నేర్పాడు. విలువిద్యలో అర్జును డంత వాడనిపించుకున్నవాడు అభిమన్యుడు.)





కృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉండగా ఒక భయంకరమైన వేసవి వచ్చింది. అరణ్యాలు అంటుకుని, వాటి మీదుగా వేడిగాడ్పులు వీచాయి. నదులు ఎండిపోయాయి. పడమటి వడగాలికి ప్రాణికోటి తల్లడిల్లి పోయింది.

ఆ వేసవిలో అర్జునుడు కృష్ణుడితో, "ఈ వేసవి దుర్భరంగా ఉన్నది. ఈ సమయంలో యమునాతీరాన గల పర్వతారణ్యాలలో వేటాడుతూ, ఇళ్ళు కట్టుకుని చల్లగా కాలక్షేపం చేస్తే ఎంతో సుఖంగా ఉంటుంది," అన్నాడు.

కృష్ణుడు నిజమేనన్నాడు. కృష్ణార్జునులూ, కొందరు స్నేహితులూ, పరివారమూ బయలు



దేరి చల్లని అరణ్య ప్రాంతంలో విడిసి, అక్కడ సుఖంగా సంచరించసాగారు. ఒక నాడు వాళ్ళు ఖాండవవన సమీపంలో చందనపుచెట్ల కొమ్మల నీడన పొదరిళ్ళలో కూర్చుని సుఖంగా భోజనాలు చేశారు. కృష్ణార్జునుల వెంట ద్రౌపదీ సుభద్రలు కూడా ఉన్నారు. అందరూ శరీరాలకు చందనం పూసుకుని, పూలమాలలు ధరించి ఉన్నారు. అందరూ కథలూ, కబుర్లూ చెప్పుకుంటున్నారు.

ఆ సమయంలో ఒక ముసలి బ్రాహ్మణుడు వారి వద్దకు వచ్చాడు. అతను చాలా ఎత్తున్నాడు. అతని శరీరం కాంతివంతంగా ఉన్నది. నారబట్టలు కట్టి, జడలు ధరించి ఉన్నాడు. అతని మీసాలు గోరోజన వర్ణంగా ఉన్నాయి. అతను వారితో, "అయ్యా, నేను భోజనప్రియుణ్ణి. మంచి జీర్ణశక్తి గలవాణ్ణి. నాకు ఇష్టమైన ఆహారం మీరు పెట్టినట్టయితే తింటాను. తిని తృప్తి చెందుతాను," అన్నాడు. [అట్ట మీది బొమ్మ]

ఈ మాటకు కృష్ణార్జునులు, "బ్రాహ్మణుడా, నీకు ఎలాటి ఆహారం కావాలో కోరుకో," అన్నారు.

"నేను అగ్నిహోత్రుణ్ణి. నాకు వేరే ఆహారం అవసరం లేదు. ఈ ఖాండవ



వనాన్ని భక్షించాలని నా కోరిక. ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని ఇంద్రుడు ధారా పాతంగా వర్షం కురిపించి నా ప్రయత్నా లకు విఘ్నం కలిగిస్తూ వస్తున్నాడు. తక్ష కుడు మొదలైన సర్పాల సహాయంతో ఇంద్రుడు ఈ వనాన్ని ఎల్లప్పుడూ కాపాడు తున్నాడు. మీవంటి మహాశూరులు సహాయ పడితేగాని నా ప్రయత్నం ఫలించదు. అందుచేత మీరు సహాయపడండి," అని ఆ బ్రాహ్మణుడు అన్నాడు.

అగ్నిహోత్రుడు ఖాండవవనాన్ని దహిం చటానికి అన్నిసార్లు ప్రయత్నించాడంటే, దానికి కారణం ఉన్నది.

పూర్వం శ్వేతకి అనే రాజు ఒకడుండే వాడు. అతను విడవకుండా యజ్ఞాలు చేస్తూండేవాడు. ఒకసారి అతను అతిదీర్ఘ మైన యాగం ఒకటి చేశాడు. అందులో శ్వేతకికి సహాయం చేసిన బ్రాహ్మణులకు పొగమూలాన కంటిజబ్బులు వచ్చాయి. శ్వేతకి వారి స్థానంలో ఇతర బ్రాహ్మణు లను తెచ్చి యాగం పూర్తిచేశాడు.

కాని శ్వేతకి మరొకసారి యాగం ప్రారం భించదలిస్తే ఎవరూ రామన్నారు. రాజు ఎంత ప్రాధేయపడినా వారు ఒప్పుకోక, "నువు చేసే యాగాలకు ఋత్విక్కుగా



పని చెయ్యటం మహాశివుడికి మాత్రమే సాధ్యమవుతుంది," అన్నారు.

శ్వేతకి కైలాసానికి వెళ్ళి శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయాడు.

"దేవా, నా యాగానికి యాజకుడివిగా ఉండు," అని శ్వేతకి శివుణ్ణి ప్రార్థించాడు.

"యాజకులుగా ఉండే పని బ్రాహ్మణు లది. అయినా, పన్నెండేళ్ళపాటు అగ్నిని అర్చించావంటే నీ కోరిక తీరుతుంది," అంటూ శివుడు అంతర్ధానమయాడు.

శ్వేతికి శివుడు చెప్పిన ప్రకారం పన్నెం డేళ్ళపాటు అగ్నికి నేతులు ఆహుతి పోసి, తిరిగి శివుడి వద్దకు వచ్చాడు.



శివుడు శ్వేతకితో, "యాజకుడు బ్రాహ్మణుడే కావాలని చెప్పాను గద. అందుచేత నేను పనికి రాను. కాని నా అంశన జన్మించిన దుర్వాసుణ్ణి యాజకుడుగా పంపిస్తాను. యజ్ఞానికి అవసరమైన ప్రయత్నాలన్నీ చేసుకో," అన్నాడు.

శ్వేతకి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. శివుడు దుర్వాసుణ్ణి యజ్ఞం చేయించమని పంపాడు. దుర్వాసుడు యజ్ఞం జరిపించి, తనకు రావలిసిన దక్షిణ తీసుకుని వెళ్ళిపోయాడు.

చివరకు జరిగినదేమంటే అగ్నిహోత్రుడికి, నెయ్యి తెగతాగి, అజీర్తిరోగం పట్టుకున్నది. అతని తేజస్సు క్షీణించింది. అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, తన అజీర్ణం పొయ్యేమార్గం చెప్పమన్నాడు.

బ్రహ్మ అగ్నిని చూసి నవ్వి, "అంతులేని నెయ్యి తాగి అజీర్తి తెచ్చుకున్నావు. ఖాండవవనాన్ని దహించినట్టయితే నీ వ్యాధి నయమై, నీ తేజస్సు నీకు తిరిగివస్తుంది. ఖాండవవనంలో అనేక రకాల ప్రాణులూ, ఓషధులూ, వనస్పతులూ, మహావృక్షాలూ ఉన్నాయి. అవి నీ వ్యాధి నివారణ చేస్తాయి," అన్నాడు.

అగ్ని బ్రహ్మ మాట విని ఖాండవ వనంలో ప్రవేశించి, దాన్ని దహించటం మొదలుపెట్టాడు. కాని వెంటనే ఏనుగు తొండాలంత ధారలతో వాన వచ్చింది. ఆ వనంలో ఉండే ఏనుగులూ, పాములూ కూడా నోళ్ళతో నీరు తెచ్చి అగ్నిహోత్రుడి మీద పోశాయి. అతని యత్నం విఫలమయింది.

అగ్ని ఖాండవవనాన్ని దహించటానికి ఏడుసార్లు ప్రయత్నించాడు. అతని ఏడు ప్రయత్నాలూ విఫలమయాయి. అగ్ని బ్రహ్మ వద్దకు తిరిగిపోయి, తాను ఖాండవవనాన్ని దహించలేక పోయాననీ, తన రోగం ఇంకా అలాగే ఉన్నదనీ తెలిపాడు.





# బస్రా నావికుడు

## 2

మరికొంతసేపటికి ఓడలోని వారికి వింతలు కనపడ్డాయి. సముద్రంలో నుంచి ఒక స్తంభం లాటిది పైకి వచ్చినట్టు కనబడింది. ఏదో మెరుపులాటిది మెరిసింది. ఇంతకన్న చిత్రమేమంటే, ఎవరూ తెడ్డు వెయ్యకుండానే, గాలి వీచకుండానే, ఓడ దానంతట అది అతివేగంతో ప్రయాణిస్తున్నది.

ఓడలోనివాళ్ళు ఆశ్చర్యపడి, అబుల్ ఫవారిస్ వద్దకు వచ్చి, "మన ఓడ దానంతట అదే ఇలా శరవేగంతో నీటిమీద కదలటానికి కారణం ఏమై ఉంటుంది?" అని అడిగారు.

అబుల్ ఫవారిస్ కళ్ళెత్తి చూశాడు. అతనికి దూరాన ఒక కొండ కనిపించింది. అది సముద్రంలో నుంచి పైకి పొడుచుకు వచ్చింది. దాన్ని చూసి అతను బాధతో పెద్దగా మూలిగి, చేతులతో కళ్ళు మూసుకుని, "చచ్చాం!" అంటూ గట్టిగా అరిచాడు.

తరవాత అతను ఓడలోని వాళ్ళతో ఇలా అన్నాడు;

"సముద్రం మీద ఎప్పుడైనా దారి తప్పటం జరిగితే చుక్కాని తూర్పుకేసి పట్టమని మా నాన్న అంటూండేవాడు. ఎందుకంటే, ఓడ పడమరకేసి పోతే అది 'సింహం నోరు' వాత పడటం తప్పనిసరి అని ఆయన అనేవాడు. 'సింహం నోరు' ఏమిటని ఆయనను అడిగాను. సముద్ర మధ్యంలో సృష్టికర్త ఒక మహా బిలాన్ని ఏర్పాటు చేశాడనీ, దానిని అనుకునే ఒక కొండ ఉంటుందనీ, ఆ బిలం పేరే 'సింహం నోరు' అనీ, నూరు మైళ్ళ దూరంలో ఉన్న ప్రతి పడవనీ అది తన కేసి బలంగా లాగుతుందనీ, 'సింహం నోరు' కు అందిన నౌక



కొండను తాకి, మునిగి పోవటమే తప్ప మళ్ళీ తేలటం ఉండదనీ ఆయన చెప్పాడు. మనం ఇప్పుడు దానికే చిక్కినట్లున్నది."

తమ నౌక వాయువేగంతో కొండను సమీపిస్తూ ఉండడం చూసి ఓడలోని వాళ్ళు భయభ్రాంతులయారు. త్వరలోనే అది సుడిగుండాన్ని చేరుకున్నది. ఆ సుడిగుండంలో ఎన్నివేల నౌకలు భగ్నమయాయో! అవన్నీ సుడిగుండంలో పడి గుండ్రగా తిరుగుతున్నాయి.

ఓడలోని వారంతా అబుల్ ఫవారిస్ చుట్టూ మూగి, "ఏం చెయ్యమంటారు? దయచేసి చెప్పండి," అని వేడుకున్నారు.

"ఓడలో ఉన్న మోకులన్నీ తీసుకు రండి. నేను సుడిగుండం కుండా ఈదుకుంటూ కొండ వద్దకు వెళ్ళి, ఓడను ఒడ్డున పెద్ద చెట్టుకు కట్టేస్తాను," అన్నాడు అబుల్ ఫవారిస్.

అతను సముద్రంలోకి దూకి ఈదుతూ పోయాడు. అదృష్టవశాన ప్రవాహం అతన్ని తీరాని కేసి తోసింది. అతను ఓడను తీరాన గల ఒక పెద్ద చెట్టుకు కట్టేశాడు.

తరవాత అతను తినేటందుకు ఏమైనా దొరుకుతుందేమోనని వెతుకుతూ కొండ ఎక్కాడు. ఎందుచేతనంటే, కొంత కాలంగా అతనికీ, ఓడలో ఉన్న అతని అనుచరులకూ తిండి లేదు.

కొండ పైకి చేరేసరికి అతనికి ఒక అందమైన, విశాలమైన మైదానం కనిపించింది. ఆ మైదానం మధ్యలో ఆకుపచ్చ రాతితో నిర్మించిన ఒక తోరణం ఉన్నది. అతను దాన్ని సమీపించి, అక్కడ ఒక ఉక్కు స్తంభాన్ని చూశాడు. దానికొక నగారా కట్టి ఉన్నది. తోరణం నుంచి ఒక రాగి పలక వేళ్ళాడుతున్నది. దానిమీద ఇలా రాసి వున్నది: "పూర్వం అలెగ్జాండరు ఈ ప్రాంతానికి వచ్చి, 'సింహం నోరు' వల్ల గల ప్రమాదాన్ని గ్రహించి, తన వెంట ఉన్న మేధావు

లతో సంప్రతించి ఈ నగారా ఏర్పాటు చేయించాడు. ఈ నగారాను మూడుసార్లు కొట్టినట్టయితే, సుడిగుండంలో చిక్కుకున్న నౌక ఏదైనాసరే వెంటనే బయట పడుతుంది."

ఈ మాటలు చదువుకుని అబుల్ ఫవారిస్, వెంటనే కొండ దిగి వెళ్ళి, తన అనుచరులతో ఈ సంగతి చెప్పాడు.

తరవాత కొంత చర్చ జరిగింది. నగారా వాయించిన వ్యక్తి, కొండ దిగివచ్చి, సుడి గుండం నుంచి దూరంగా వెళ్ళిపోయిన ఓడలో ఎక్కటం సాధ్యంకాదు.

"ఓడను కాపాడటం ముఖ్యం. నేను నగారా వద్దకు తిరిగివెళ్ళి దాన్ని మూడు సార్లు కొడతాను. ఓడతోబాటు మీరందరూ ప్రాణాలు దక్కించుకోండి. నేను ఈ దీవిలో దిగబడిపోతాను. గత్యంతరం లేదు. నేనీ త్యాగం చేస్తున్నందుకు మీరు నాకొక ప్రత్యుపకారం చెయ్యండి—నౌకలో ఉన్న సరుకులో సగం, బస్రాలో ఉన్న నా భార్యకూ, కొడుకులకూ ఇవ్వండి. నా గతి ఏమైతే అదవుతుంది," అన్నాడు అబుల్‌ఫవారిస్ తన అనుచరులతో.

అలాగే చేస్తామని ఓడలో వాళ్ళందరూ ప్రమాణాలు చేశారు. అబుల్‌ఫవారిస్



తోరణం వద్దకు తిరిగివచ్చి, ఒక కర్రతో నగారాను మూడుసార్లు కొట్టాడు. దాని ధ్వని చుట్టుపక్కల కొండల నుంచి గొప్పగా ప్రతిధ్వనించింది. ఈ ప్రతిధ్వను లింకా ఆగకుండానే, సుడిగుండంలో ఉన్న నౌక, ఎక్కుపెట్టి విడిచిన బాణంలాగా సముద్రం మీదికి వెళ్ళిపోయింది. ఓడలోని వారంతా గట్టిగా అరిచి, అబుల్‌ఫవారిస్‌కు వీడ్కోలు చెప్పారు.

కాలక్రమాన ఆ ఓడ బస్రా చేరింది. అందులోని నావికులు ఓడలోని సొత్తులో సగం అబుల్‌ఫవారిస్ భార్యకూ, బిడ్డలకూ అందజేశారు. అబుల్‌ఫవారిస్ కుటుంబం

తమ కుటుంబపెద్ద తమ కికలేనట్టుగానే భావించి శోకాలు పెట్టారు.

అక్కడ దీవిలో అబుల్‌ఫవారిస్ ఆ రాత్రి తోరణం కింద పడుకుని నిద్రపోయి, మర్నాడు లేచి, తానింకా ప్రాణాలతో ఉన్నందుకు భగవంతుడికి ధన్యవాదాలు చెప్పుకుని, మైదానం మీదుగా నడవసాగాడు. మైదానం మధ్యలో నల్లటి పొగ పైకి లేస్తూ ఉండటం అతనికి కనబడింది. మైదానంలో అనేక వాగులు పారుతున్నాయి. అతను తొమ్మిది వాగులను దాటాడు.

అతను ఆకలితోనూ, అలసటతోనూ చచ్చిపోవటం తప్పనిసరి అనుకుంటూండగా కొంతదూరాన గొర్రెలు మేస్తూ కనిపించాయి. వాటిని చూడగానే అతనికి ప్రాణాలు లేచి వచ్చాయి. దగ్గిరలో మనుషులున్నారన్న మాట!

అతను గొర్రెలున్న దిక్కుగా నడుస్తూ ఒక వింత ప్రాణిని చూశాడు. ఆ ప్రాణి ఒక దీర్ఘకాయుడైన యువకుడు. అతని ఒంటి మీద చిరిగిపోయిన ఎర్రటి కంబళీ లాటిది ఉన్నది. అతని తలకూ, ఒంటికీ కవచం ఉన్నది. అబుల్‌ఫవారిస్ ఆ యువకుణ్ణి పలకరించాడు.

ఆ యువకుడు అతన్ని ఎదురు పరామర్శించి, "ఎక్కడి నుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

అబుల్‌ఫవారిస్ తానొక అభాగ్యుణ్ణని తెలిపి, తనకు కలిగిన కష్టాలన్నీ ఆ యువకుడికి చెప్పుకున్నాడు.

దీర్ఘకాయుడైన ఆ యువకుడు నవ్వి, "నువు అభాగ్యుడివి కావు, అదృష్టవంతుడివే. అందుకే సింహం నోరు నుంచి తప్పించుకున్నావు. ఇక నీకే భయమూ లేదు. నిన్నొక గ్రామం చేర్చుతాను," అంటూ అబుల్‌ఫవారిస్‌కు రొట్టెలూ, పాలూ ఇచ్చి, భోజనం చెయ్యమన్నాడు.

—(ఇంకా వుంది)



# 106. మావోరీలు

న్యూజీలాండులో మావోరీ తెగవారు అనేక శతాబ్దాలుగా ఉంటున్నారు. వారంతా కలిసి సుమారు లక్షమంది ఉంటారు. ఒకప్పుడు వారికీ, తెల్లవారికీ హెూరాహెూరి యుద్ధాలు జరిగాయి. అయితే 1840లో వారు బ్రిటిష సామ్రాజ్యంలో చేరటానికి సమ్మతించి, ప్రశాంతంగా జీవిస్తున్నారు. మావోరీ స్త్రీలు చాపలు అల్లుతారు, పురుషులు కొయ్య చెక్కడం పని చేస్తారు. వారు తమ జాతి జీవితాన్ని ఇంకా అనుసరిస్తున్నారు. బొమ్మలో చూపిన కొయ్య విగ్రహం ఉత్తర దీవిలోని మావోరీ సభా మందిరం వద్ద ఉన్నది. ముక్కులు నొక్కుకోవటం స్వాగత చిహ్నం.



Photo by Anilkumar J. Parikh



బహుమతి
పొందిన వ్యాఖ్య

మమ శరణం

పంపినవారు:
ఎస్. టేకుమళ్ళ, మద్రాసు-20

Photo by Anilkumar J. Parikh



బహుమతి
పొందిన వ్యాఖ్య

తవ చరణం

పంపినవారు:
ఎస్. టేకుమళ్ళ, మద్రాసు-20

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మమ శరణం

రెండవ ఫోటో : తవ చరణం

పంపినవారు : సీతారాం టేకుమళ్ళ,
అడయార్, మద్రాసు - 20

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకొన్నట్లైన ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్ని అరికట్టుతుంది.




ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా సంరక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టింపబడినది. ఇందులో ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన యాస్ట్రింజెంట్స్ ఉన్నవి. నియమానుసారం రాత్రి, ప్రొద్దుట ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకొనుటవల్ల ఇగుళ్ల బాధలూ దంతక్షయమూ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం అలవాటు చేయటానికి వెంటనే ప్రారంభించండి. క్రొత్త విషయాలని నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పాలి. కనుక వెంటనే ప్రారంభించండి.

**ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ గురించి ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.**

**ఫోర్‌హాన్స్**

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్టు

**ఉచితము** "దంతములు, ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పదిభాషలలో మానర్స్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టుబాక్సు నం. 10031, బొంబాయి-1 (BR) వారి వద్ద దొరకును.

పేరు ______________________ వయస్సు ________

చిరునామా ______________________



దయచేసి పోస్టు ఖర్చులకై 15 పైసల తపాలా బిళ్లలను పంపండి. మీకు కావలసిన భాషను సూచిస్తూ దాని క్రింద గీతగీయండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, తమిళ, తెలుగు, మలయాళం, లేక కన్నడ భాష

82F.172 TEL

'C. 1'

*FOR PRECISION IN...*

# Colour Printing

*By Letterpress...*

...Its B. N. K's., superb printing
that makes all the difference.
Its printing experience of
over 30 years is at the
back of this press superbly
equipped with modern
machineries and technicians
of highest calibre.



